JAGATI Rs. 2-00 August 1989

34th Year of Publication




## ఆగస్టు – 1989

## సాహితీ సుధ

కరిరాజున్ బిసతంతుసంతతులచే గట్టన్ విజృంభించు వా
డొరువజ్రంబు శిరీషపుష్పములచే నూహించు భేదింప దీ
పరవింతన్ లవణాబ్ధికిన్ మధుకణప్రాప్తిం బ్రవర్తించు ని
ర్ధరణిన్ మూరుల దెల్పు నెవ్వడు సుధాధారాను కారోక్తులన్

—భర్తృహరి



కనకంబు పుట్టదే గరిమ మృత్తికయందు, శుక్తిలో బుట్టదే మౌక్తికంబు
కస్తూరి పుటదే కరమరి మృగమందు, నడుసులో బుట్టదే యంబుజంబు
మహి దేనె పుట్టదే మాక్షికంబులయందు, బుట్టదే పట్టును బురువులందు
వజ్రంబు పుట్టదే వరుసతో శిలలందు, గాలాగ్ని పుట్టదే కాష్ఠమందు
నధికు లుదయింతు రీరీతి విధములందు, కులము పాటింప నేటికి గుణము గల్గ
ప్రణుతధవళాంగ మౌనిహృత్పద్మభృంగ, అమిత భవభంగ శ్రీ కాళహస్తిలింగ

—శ్రీకాళహస్తిలింగ శతకం

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు 600004
ఫోన్ : 76697- చందా 2 సం॥లకు రు. 45-00 – 5 సం॥లకు రు. 100-00. జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం : కన్నీరు కార్చే వృక్షరాజం

# నిమ్మతొనలు

బెర్నార్డ్ షా కు, రంగస్థలనటి ఎల్లెన్ టెర్రీకి మధ్య ప్రణయ కావ్యాలనదగు లేఖలు నడిచేవి. తను అస్వస్థునిగా ఉన్నప్పుడు సపర్యలు చేసిన ఛార్లొట్టీని వివాహం చేసుకున్నాడు బెర్నార్డ్ షా. భార్య గురించి ఎల్లెన్ టెర్రీకి చెప్పగా, 'ఇక్కడి కొకసారి తీసుకు రాకూడదూ, చూస్తాను' అన్నదట. బెర్నార్డ్ షా మహాచిరాకు పడుతూ, "థియేటర్‌లోని గ్రీన్‌రూమ్ అనుకున్నావా? ఇతరుల వ్యక్తిత్వాన్ని నేను గౌరవిస్తాననేది నేను వ్రాసిన యిన్ని నాటకాలలో ముఖ్య పాత్ర వేసిన నీకు ఇప్పటికీ బోధపడలేదా? నీ ముందుకి తీసుకొచ్చి ప్రదర్శించేందుకు ఆమె ఒక వస్తువు అనుకున్నావా? మంచీ మన్నన తెలిసిన నిండు ప్రాణి - ఒకవ్యక్తి. నేను చెప్పే మానవత్వం కించిత్‌కూడా నీ బుర్ర కెక్కలేదే!" అన్నాడట.... నోట మాట రాక నిశ్చేష్టురాలయింది తన నంతగా ఆరాధించే షా పలుకులకి ఎల్లెన్ టెర్రీ.

జికె ఛెస్టర్‌టన్, జార్జి బెర్నార్డ్ షా ఒకే వేదిక మీద నుంచి మాట్లాడుతున్నారు. .... "ఈయన గారు హత్యలు చేసిన వారినే గాకుండా, హత్యలు చేయని హంతకులని కూడా కనిపెట్టాడు (తన నవలల్లో). ఇక, నేనేమో నాటకాల రూపంలో అందమైన అబద్ధాలు ప్రచారం చేస్తున్నాను. ఈ మనుషులు మారతారనీ, ఈ ప్రపంచం బాగుపడుతుందనీ, భ్రమించడంలో యిద్దరం పిచ్చివాళ్లమే! ఇక్కడగాక ప్రాచ్యఖండమైతే మమ్మల్ని 'ఉన్మాదులు' అనేవారు. 'ఆ పిచ్చివాళ్లిద్దరూ ఏమిటో చెబుతున్నారు జాగర్తగా వినండి - కాని, వారు పిచ్చివాళ్లనే విషయం మాత్రం మర్చిపోకండి - అనేవారు.

నేర్చుకోవాలనే ఆసక్తి లేనివానికి, అంటే తృష్ణ లేనివానికి, ఏదో కొంత పట్టు బలవంతాన బోధించి, అది ముక్కున పెట్టుకు వొప్పజెప్పిన మీదట ప్రవీణుడనే యోగ్యతా పత్రం యివ్వడంతో, సగటు పెద్దమనిషికి కావల్సిన విద్య పూర్తవుతుంది. ఆ పైన ఇతగానికి ఫిలాసఫీ అంటే వక్రభాష్యం గాను, సైన్సు అంటే అంధ విశ్వాసం గాను కనిపిస్తుంది. అటువంటిదే ఈ కాలేజీ చదువు ... (జిబి షా)

మాంఛెస్టరులో తయారయే కత్తీ సరుకులకి కొత్త మార్కెట్ కావలసి వచ్చినప్పుడు, నేటివులకి

శాంతి బోధలు గావించేందుకు ఒక ఫాదరీని పంపుతాడు ఆంగ్లేయుడు. నేటివులు ఆ ఫాదరీని చంపుతారు. అప్పుడు క్రైస్తవమతాన్ని కాపాడేందుకు ఆయుధం ధరిస్తాడు ఆంగ్లేయుడు. క్రైస్తవం కోసమే పోరాడుతాడు; పవిత్ర క్రైస్తవం కోసమే విజయం సాధిస్తాడు. ఆ కొత్త మార్కెట్‌ని భగవంతుని ప్రసాదంలా పుచ్చుకుంటాడు. ఆంగ్లేయునిలో ఉన్నంత మంచీ చెడూ యింకెక్కడా లేవు. ఆంగ్లేయు డేనాడూ తప్పుడు పని చేయడు. ప్రతిదీ సూత్ర న్యాయం ప్రకారమే చేస్తాడు. దేశభక్తి సూత్ర న్యాయంతో పోరాడుతాడు. వ్యాపార సూత్రాలతో దోపిడీ చేస్తాడు: సామ్రాజ్యస్థాపన సూత్రాలతో బానిసలను వలసల్లో తయారుచేస్తాడు. శౌర్య దీప్తి సూత్రాలతో హింసిస్తాడు. స్వామిభక్తి సూత్రాలతో రాజుకి మొక్కుతాడు; రిపబ్లికన్ సూత్రాలతో ఆరాజు తల నరుకుతాడు. సమస్తం సూత్ర న్యాయానికీ, డ్యూటీకి లోబడి వుండవల్సిందే! ('మాన్ ఆఫ్ డెస్టిని లో')

ఒక సోషలిస్ట్ మీటింగులో బెర్నార్డ్ షా, సంఘంలోని డిస్ట్రిబ్యూషన్ సిస్టమ్ గురించి, డబ్బు పంపకం గురించి మాట్లాడుతున్నాడు.

'నేను ఈ హాలులోకి రావడానికి ముందు - హాలు వెలుపల ఒక చక్కటి రోల్స్‌రాయిస్ చూశాను అంత ఖరీదైన మోటారు కారు ఒక వ్యక్తి సొంతమై వుండటం సహించవచ్చా? ఈ మహాపట్నంలో ఎందరు పేద వాళ్లు వున్నారో మీకు తెలుసు - అంత సొమ్ము ఒకరి దగ్గిర చేరటం అన్యాయం కదా?'

సభికులలో కలవరం - కొందరు లేచారు బయటనున్న కారు ముక్కలు చేయాలని!

"మీ ఆవేశం చూస్తే నాకు జాలేస్తోంది. మీరు ధ్వంసం చేయబోయే ముందు తెలుసుకోవాలసిందేమిటంటే, ఆ కారు నాది."

—క్షీరసాగరమ్







# పాఠకుల తీర్పు

చందూర్‌గారికి : 'జ గ తి' చదువుతుంటే టైము తెలవడంలేదు.

'నిమ్మతొనలు' ఎంతో రుచిగా ఉంటున్నవి. అన్ని పేజీలు చదివితే గాని పత్రిక వొదల బుద్ధికాదు.

—ఇ శేఖర్‌బాబు
మైలవరం

శ్రీ చందూర్‌గార్కి నమస్కారములు. 'జ గ తి' లో మీ 'డైరీ' చదువుతుంటే కళ్లముందు ఎన్నో సినిమారీళ్లు కదలాడుతుంటాయి. అంత చక్కగా హృదయానికి హత్తుకొనేలా వ్రాసే నేర్పు మీకే వుంది - మా అభినందనలు.

—టి వీరభద్రయ్య
శ్రీకాకుళం

చందూర్‌గారికి : 'జ గ తి' పత్రికలోని విషయాలన్నీ ఆసక్తికరంగా హర్షదాయకంగా ఉంటున్నవి. మీ దంపతుల నిర్విరామ సారస్వత కృషికి మా అభినందనలు.

—జివిజి కృష్ణమూర్తి
న్యూఢిల్లీ-3

మావయ్యగారికి : 'జ గ తి' రాగానే నాకన్నా ముందుగా తను తీస్కుని, అంతా చదివి, ఎంత బాగా రాస్తారో ఎంత చక్కగా వుంది చదువుతే, ఎన్ని సంగతులు తెలుస్తాయో అనేది - ఈ పత్రికొక్కటే మాకు మద్రాసుజీవితంతో లింక్.... విజయవాడ వెళ్లింది - అక్కడ రెండు రోజులువుండి పేరూరు వెళ్లింది. ఎవరి చేతా చేయించుకోకుండా, అలిసిన శరీరాన్ని వొదిలేసి, తలిదండ్రులు భూశయనం గావించిన చోటనే, తనూ పంచభూతాలలో కలిసిపోయిన అదృష్టవంతురాలు, మా అమ్మ .... పద్మకొడుక్కి 'అభిషేక్' అని పేరు పెట్టారు వాళ్ల తాతగారు.

—ఎ కల్పకం
జబల్పూర్-5

చందూర్‌గారికి : వారం వారం మాలతీ చందూర్‌గారి 'జవాబులు' చదువుతూంటే, ఆ పదినిముషాలు మీ యింట్లో, ఆఫీసురూమ్‌లో కూచుని, మీ ఇద్దరితో మాట్లాడుతున్న అనుభూతి కలుగుతుంది. వెనకటి పరిచయమే ఆ భావన కలగజేస్తోందేమో నాకు తెలియదు. మా బాబుకి 'వంశీ' అని పేరు పెట్టాము.

—కెవి శాస్త్రి
బెంగుళూరు-4

ఎడిటర్‌గారికి : మీ పత్రికలోని 'పాతికేళ్లనాటి పిక్చర్' నాకు బాగా నచ్చుతోంది. కాని, వాటిని చూడగల అవకాశం ఉందంటారా ?

—కె రామారావు
ఒంగోలు

## వెన్నెల కెరటాలు



### సత్యమూర్తి

మొదట్లో ఉప్పు సత్యాగ్రహం, పౌర అవిధేయత ఉద్యమాల్లో పాల్గొనక పోయినా, ఎంతో కాలం వాటికి దూరంగా ఉండలేకపోయాడు. ప్రకాశం, రాజగోపాలవారి గార్లను నిర్బంధంలోకి తీసికోవడంతో మద్రాసులో సరైన నాయకుడే లేకుండాపోయాడు. సత్యమూర్తి జాతి మర్యాదను కాపాడటానికి రంగంలోకి దుమికారు. మేజిస్ట్రేటు ఉత్తర్వును లెక్కచేయక కౌన్సిలుకు తననే అధ్యక్షునిగా ప్రకటించుకు, జాతీయ పతాకాన్ని ఎగురవేశారు. కొంతమంది స్వచ్ఛంద సేవకులతో విదేశీ వస్తువులు అమ్మే దుకాణాలవద్ద పికెటింగ్ చేశారు. తత్ఫలితంగా 6 నెలల కారాగార వాసం.... సత్యమూర్తి రాజకీయ రంగంలో ఎంతటి సమర్థులో, విద్యా రంగంలో కూడ అంతటి నిపుణులు. అన్నామలై విశ్వవిద్యాలయం ఉద్భవించటానికి మూల కారకులు సత్యమూర్తి. ఆంగ్లం, తమిళం, సంస్కృతం - ఈ త్రిభాషలలో దిట్టఅయిన 'సత్యమూర్తి, సంస్కృత అకాడమీ మూలస్తంభాలలో ఒకరు. అయన హృదయంలో సంస్కృత భాషకే ప్రథమస్థానం. స్త్రీ విద్యను ప్రోత్సహించిన సత్యమూర్తి స్త్రీలు హిందీ, తమిళం, ఆంగ్ల, సంస్కృత సాహిత్యాలలో నిషాతులు కావాలని అన్నారు.

—యమ్మెల్ బజాజ్
'సైనిక సమాచార్' లో

### ఆత్మ ప్రస్థావన

ఆత్మ ప్రస్థావనని (Self - Alienation) అనవచ్చు. మానవ జీవితంలో అతి ప్రధాన పాత్ర వహించే ప్రేమానుభూతిని ఆధారం చేసుకుని ఈ మానసిక స్థితిని విశ్లేషించే ప్రయత్నం శాస్త్రజ్ఞులు చేశారు. వీరి ప్రకారం ప్రతి వ్యక్తి తన పూర్ణ వ్యక్తిత్వాన్ని దృష్టిలో వుంచుకుని, తాను ప్రేమించిన వ్యక్తిని పొందే ప్రయత్నంలో తమ యిద్దరి వ్యక్తిత్వాలలోని భిన్నత్వాన్ని మర్చిపోయి, ఏకత్వాన్ని సాధించే ప్రయత్నం చేస్తాడు. అయితే ప్రేమను పొందేందుకు చేసే ప్రయత్నాలలో అవరోధాలు ఏర్పడి ఎప్పుడైతే వీరి మధ్య స్నేహసంబంధాలు విచ్ఛిన్నం అవుతాయో అప్పటినించే వారిలో ఆత్మ ప్రస్థావనకు సంబంధించిన భావాభిప్రాయాలు చెలరేగుతాయి. తత్ఫలితంగా అంతవరకు ప్రాణంగా భావించిన వ్యక్తిని పూర్తిగా పరాయి మనిషిగా

భావించడము జరుగుతుంది .... వ్యక్తుల మనోవృత్తుల విశ్లేషణ 'ఎలియనిషన్' ద్వారా సమర్థవంతంగా చెప్పారు రాజేంద్ర యాదవ్, తమ కథలలో.

—ఉషా లావణ్య
'స్రవంతి'లో

## నాస్తికత్వం

ప్రపంచమంతటా, ప్రతి మతం లోనూ క్రైస్తవం కానివ్వండి, యూదు మతం కానివ్వండి, ఇస్లాం కానివ్వండి, జొరాష్ట్రియన్ మతం కానివ్వండి, హిందూమతం కానివ్వండి, షింటో మతం కానివ్వండి, ఆటవిక తెగల నమ్మకాలు కానివ్వండి, నాస్తికత్వం గురించి తెలుసుకొనుట ప్రయత్నించినా, లేక నాస్తికులతో స్నేహం చేసినా తీవ్రపరిమాణాలు ఎదురౌతాయని భయపెట్టారు. ప్రజలలో నుంచి భయం పోతే, భయం మనస్తత్వం పోతే మతాధికారుల, పురోహితుల పట్టుపోతుంది. అందుచేత వారు ప్రజలలో నాస్తికత్వం అన్నా, నాస్తికులన్నా భయం సృష్టించారు. ఎందుకంటే నాస్తికత్వం భయానికి, భయం మనస్తత్వానికి వ్యతిరేకం. "నిర్భయంగా, ధైర్యంగా జీవితాన్ని ఎదుర్కోండి ; సత్యాన్వేషణ చెయ్యండి, జ్ఞానం ; సంపాదించండి మానవులంతా ఒక్కటేనని చాటండి, సమ సమాజాన్ని నిర్మించండి'' అని నాస్తికత్వం చెబుతుంది. ఈవిధంగా నాస్తికత్వం నిర్భయత్వం మీద, ధైర్యం మీద ఆధారపడింది.

—లవణం
'నాస్తిక మార్గం'లో

# మానవ ప్రగతి

## ఆస్కార్

ఒక యువకునికి, మధ్య వయస్కుడైన అతని అన్నతో ఏర్పడే సంఘర్షణ ఆధారంగా రూపొందిన "రెయిన్ మాన్" చిత్రం 1988 వ సంవత్సరపు ఉత్తమ చలన చిత్రంగా, 'అకాడమీ ఆఫ్ మోషన్ పిక్చర్ ఆర్ట్స్ అండ్ సైన్సెస్' నుంచి అత్యంత ప్రతిష్ఠాత్మకమైన 'ఆస్కార్' అవార్డును అందుకున్నది. ఇందులో మధ్య వయస్కునిగా నటించిన డస్టిన్ హాఫ్ మన్, దీనికి దర్శకత్వం వహించిన బారీ లెవిన్సన్ కూడా ఉత్తమ నటునిగా, ఉత్తమ దర్శకునిగా 'ఆస్కార్' అవార్డులు పొందారు. పెక్కు సందర్భాలలో ఏదో ఒక చిత్రం మాత్రమే ఏకకాలంలో అనేక ఆస్కార్‌లను గెలుచుకోవడం జరిగింది. అయితే ఈ ఏడాది జరిగిన అవార్డుల ప్రదానోత్సవం కథ మరోవిధంగా వుంది. 'రెయిన్ మాన్' చిత్రం 'ఉత్తమ ఒరిజినల్ స్క్రీన్‌ప్లే' బహుమతితో సహా మొత్తం నాలుగు ఆస్కార్‌లను గెలుచుకోగా 'హు ఫ్రేమ్‌డ్ రోజర్ రాబిట్' అనే లైవ్ యాక్షన్, యానిమేషన్ కామెడీ చిత్రం కూడా ఇదే సంఖ్యలో అవార్డులను పొందింది. కాగా 'డేంజరస్ లైజన్స్' అనే మరొక చిత్రం మూడు బహుమతులను గెలుచుకున్నది. నెపోలియనిక్ ఫ్రాన్స్‌లోని అకృత్యాలు, ప్రతీకారేచ్ఛపై వచ్చిన స్టేజి నాటకం 'లైస్ లైజన్స్ డేంజరూసెస్' ఈ చిత్రానికి ఆధారం. ఇలా వుండగా అత్యుత్తమ నటనకు ఇచ్చే నాలుగు అవార్డులు ఈ పర్యాయం నాలుగు వేర్వేరు చిత్రాలలో నటించిన వారికి లభించాయి. 'ది అక్యూజ్‌డ్'లో అత్యాచారానికి గురైన స్త్రీగా నటించిన జోడీ ఫోస్టర్ (25)కి ఉత్తమ నటి అవార్డు లభించింది. 'ఎ ఫిష్ కాల్డ్ వాండా'లో ప్రదర్శించిన హాస్య నటనకుగాను కెవిన్ క్లయిన్‌కి ఉత్తమ సహాయనటుని అవార్డు, అనే టేలర్ నవల ఆధారంగా రూపొందిన ది 'యాక్సిడెంటల్ టూరిస్ట్'లో అందమైన, విపరీత మనస్తత్వం గల యువతిగా నటించిన జీనా డేవిస్‌కి ఉత్తమ సహాయ నటి అవార్డు లభించాయి. ఉత్తమ నటుని అవార్డు 'రెయిన్ మాన్'లో నటించిన డస్టిన్ హాఫ్‌మన్‌కి

కాగా, 1988 లో వచ్చిన 'మిసిసిపీ బర్నింగ్', 'వర్కింగ్ గర్ల్', 'గొరిల్లాస్ ఇన్ ది మిస్ట్' లాంటి పేరెన్నిక గన్న చిత్రాలు ఆస్కార్ అవార్డు నిర్ణేతలను అంతగా ఆకట్టుకోలేక పోయాయి. అయితే అంతగా ప్రచారం పొందని 'బర్డ్', 'బీటిల్ జ్యూస్', 'ది మిలాగ్రో బీన్ ఫీల్‌వార్' లాంటి చిత్రాలు ఆస్కార్‌ని పొంద గలిగాయి. ఉత్తమ నటి అవార్డు విష యంలో విజేత, జోడి ఫోస్టర్ మరి కొందరు నటీమణులనుంచి గట్టిపోటీని ఎదుర్కొనవలసి వచ్చింది. 'డేంజరస్ లైజన్స్' లో నటించి గ్లెన్ క్లోజ్ (ఈమె ఏడేళ్లలో అయిదవసారి ఈ అవార్డుకు నామినేట్ అయింది) 'వర్కింగ్ గర్ల్' లో నటించిన మెలానీ గ్రిఫిత్, 'ఎ క్రయ్ ఇన్ ది డార్క్' లో నటించిన మెరిల్ స్ట్రీప్ 'గొరిల్లాస్ ఇన్ ది మిస్ట్' లో నటించిన సిగర్నీస్ వీవర్ ఉత్తమ నటి అవార్డుకు పోటీ పడ్డారు. ఇక ఉత్తమ సహాయ నటుడుగా క్లయిన్, ఉత్తమ సహాయ నటిగా డేవిస్‌లు ఆశ్చర్యకర మైన రీతిలో అవార్డులు పొందారు. ఈ పోటీలో క్లయిన్ ప్రముఖ నటులైన మార్టిన్ లాండా ('టక్కర్') డీన్ స్టాక్‌వేల్ ('మారీడ్ టు ది మాబ్'), ఇంకా ఇదివరకటి విజేత అలెక్ గ్వినెస్ ('లిటిల్ డారిట్'), యువకు డైన రివర్ ఫోనిక్స్ ('రన్నింగ్ ఆన్ ఎంప్టీ') పైన విజయం సాధించారు. కాగా ఉత్తమ సహాయ నటి అవార్డు విజేత డేవిస్, వర్కింగ్ గర్ల్‌లో నటించిన వీవర్, ఇంకా జోన్ కుసాక్ ('వర్కింగ్ గర్ల్') ఫ్రాన్సిస్ మెక్ డొర్మాండ్ (మిసిసిపీ బర్నింగ్), మైకేల్ ఫీఫర్ (డేంజరస్ లైజన్స్) లను అధిగమించింది. డెన్మార్కుకు చెందిన 'పీలే ది కాంకరర్' 1988 లో అమెరికాలో విడుదలైన విదేశీ భాషా చిత్రాలలో ఉత్తమమైనదిగా ఎంపిక బహుమతి నందుకున్నది. ఈ బహుమతికి నామినేట్ అయిన ఇతర చిత్రాలలో ఇండియాకు చెందిన 'సలాం బాంబే', 'హనూసెన్' (హంగరీ), 'ది మ్యూజిక్ టీచర్' (బెల్జియం), వుమెన్ ఆన్ ది వెర్జ అఫ్ నెర్వస్ బ్రేక్ డవున్ (స్పెయిన్) వున్నాయి. అవార్డుల హడావుడిలో నామినేషన్లకు సంబంధించిన కొన్ని ఆసక్తికరమైన అంశాలు మరుగున పడిపోయాయి. ఉదాహరణకు బ్రిటన్‌కి చెందిన హాస్య చిత్రాల మహాదర్శకుడు ఛార్లెస్ క్రిచ్‌టన్ (78) దాదాపు ఒక 'తరం' పాటు చిత్ర పరిశ్రమ వెలుపల వుండిపోయి 'ఎ ఫిష్ కాల్డ్ వాండా' తో మళ్లీ చిత్ర రంగ పునఃప్రవేశం చేశారు. ఇక ఇప్పుడు 'కారెక్టర్ యాక్టర్' గా మన్ననలు పొందుతున్న మధ్య వయస్కుడైన నటుడు స్టాక్ వెల్ 1940 ప్రాంతంలో బాల నటుడుగా ప్రసిద్ధి చెందారు.

## గాడిదని రక్షించండి

ఓ ఇంగ్లీషు ప్రొఫెసరుగారు 'ఇది వరకు 'డాంక్' లా ఉండేవాడు ఇప్పుడు యాస్‌గా మారాడు'

అన్నాడట. .... బహుశా ఆయన దృష్టిలో యాస్ అంటే డాంకీ కంటే కాస్త నుతి మెత్తనైనదనే భావన కావచ్చు. కానీ మనకు గార్దభమన్నా, ఖరమన్నా, గాడిదలన్నా, అన్ని ఒకటే! అయితే గుజరాత్ కచ్ ప్రాంతాన 'ఘుడాఖర్' అనే ఓరకం గాడిదలున్నాయి. ఇవి తెలివైనవట. గాడిదలు బరువులు లాగుతూ ఉన్న రోజుల్లో వీటి సంఖ్య అధికంగా ఉండేది. మానవునికి వాటి అవసరం లేకపోవడంతో గార్దభజాతి ఆనాటి కానాడు క్షీణించి పోతోంది. అడవి గాడిదలు చాలా వేగంగా పరుగెడ తాయి — గంటకు 90 కిమీ కూడా పరుగెత్తుతాయి. 1946 లో దాదాపు 4000 అడవి గాడిదలుండేవి కచ్‌లో 1962 నాటికి ఆ సంఖ్య వెయ్యికి పడి పోయింది. 1970 లో కొచ్చేసరికి కేవలం 362 మాత్రమే మిగిలి ఉన్నాయి. ప్రకృతి ప్రసాదించిన అరు దైన బహుమతి అడవి గాడిదల్ని కాపాడానికి భారత ప్రభుత్వం - గుజరాత్ అటవీశాఖ కంకణం కట్టు కున్నాయి. ఈ అడివి గాడిదలు ప్రాంతానికో రకంగా ఉంటాయి — 'లడక్' లో కనిపించే రూపంలో ఇవి 'కచ్'లో కనపడవు. అదే కాశ్మీర్‌లో మరోరకంగా ఉంటాయి.

## ఔషధం

మానవాళికి ప్రయోజనం చేకూర్చే నూతన ఔషధాలను కనుగొనేందుకు, భారత, అమెరికన్ శాస్త్రవేత్తలు ఇప్పుడు హిందూ మహాసముద్ర గర్భంలోని వృక్ష, జీవరాశిపై ఉమ్మడి పరిశోధనలు జరుపు తున్నారు. హిందూ మహాసముద్రం లోని జంతుజాలం నుంచి తీసిన సుమారు 125 రసాయనాల వైద్య ప్రభావంపై లక్నోలోని కేంద్ర ఔషధ పరిశోధనా సంస్థ శాస్త్రజ్ఞులు ఒక క్రమ పద్ధతిలో పరిశోధనలు జరుపుతున్నారు. వీటిలో కొన్ని రసాయనిక పదార్థాలకు వ్యాధి కారక సూక్ష్మజీవులను నిరోధించగల 'యాంటీబాక్టీరియల్', లేదా, 'యాంటీ వైరల్' లక్షణాలు వుండగా మరి కొన్నింటికి సంతానోత్పాదనను, క్యాన్సర్ పెరుగుదలను, బ్లడ్ షుగర్ స్థాయిని అరికట్టగల సామర్థ్యం వున్న దంటున్నారు. ఈరసాయనిక పదార్థాల గుర్తించగల అత్యాధునిక ప్రక్రియల వినియోగంలో భారతీయ పరిశోధనకు అమెరికాలోని స్టీవెన్స్ సాంకేతిక పరిజ్ఞాన సంస్థ శాస్త్రవేత్తలు సహకరి స్తున్నారు. ఈ భారత - అమెరికన్ ఉమ్మడి పరిశోధనలు వల్ల అందరికీ ప్రయోజనం చేకూరగలదు. ✱

---

### నెహ్రూవాణి

నిత్యమూ పరిణతి చెందే ఈ చైతన్య వంతమగు ప్రపంచంలో, సత్యసంధత పేరిట జడులయేవారు, వెనకబడక తప్పదు.

1952 మే 04

---

# పాతికేళ్ళనాటి పిక్చర్

## రేఖా మురళీవారి 'దేవత'

'మావూరు మదరాసు నాపేరు రామ్‌దాసు, మావూరు బొంబాయి, నాపేరు రాధాబాయ్' అని పద్మనాభమూ, గీతాంజలీ అంటూవుంటే, ఏదో యిద్దరు మంచివాళ్లు తమాషా చూపిస్తున్నారు, చూదాం లెమ్మని – అనిపిస్తుంది. అటువంటి దుస్తులూ దృశ్యాలూ, పాటాపల్లవీ, కథా కారుణ్యం సినీప్రేక్షకులకు సుపరిచితమైనప్పటికీ, ఈ తడవ ఈ నూతన జంట కొంత నాజూకుతనం కనబరిచారు. ఆదర్శ గృహిణి, రైలుప్రమాదం, మనిషిని పోలిన మనిషి, అపర శ్రీరామచంద్రుని పత్నీ వియోగం, చివరికి శిధిల హృదయాన్ని అతికే శీలవతి - యిటువంటివి చూసి చూసి వుండటంచేత, పద్మనాభం గీతాంజలి కనిపించగానే అత్తరు పరిమళం గుర్తుకొస్తుంది .... 'అన్నపూర్ణకు సుద్దియౌనతని గృహిణి' (సావిత్రి), అత్తమామలకు సేవచేస్తూ, భర్తకు (యన్‌టిఆర్) సకలోప చారాలు గావిస్తూ, బంధుమిత్రాదుల వల్ల దేవతగా పరిగణింపబడి, పదేళ్లకొడుకుకి (మురళి) ఆదర్శ మాతయై, అమాంతం ఒక రైలు ప్రమాదంలో అసువులు బాసి, ఒక క్లిష్ట సమస్య తెచ్చిపెడుతుంది. అలెగ్జాండర్ డ్యూమాస్ ఏ సుముహూర్తాన 'కార్సికన్ బ్రదర్స్' వ్రాశాడోగాని, వెండితెర కది నిరంతర కథా స్రవంతి అయింది. కథానాయకునికి ముమ్మూర్తులా తన భార్యని పోలిన ఒక లలిత (సావిత్రి) రైల్వేహాస్పటల్‌లో కనబడగా, ఆ లలితే తన సీత అనుకొని యింటికి తెస్తాడు. ఒక లేడీ డాక్టరు వచ్చి, లలితను పరీక్ష చేసి, ఈమెకింకా పెళ్లి కాలేదనీ, 'వర్జిన్' అనీ, ఎక్స్‌పర్ట్ ఒపీనియన్ యిచ్చేదాకా, ఒరిజినల్ సీతకు, ప్రమాద కారణంగా మతిభ్రమణ కలిగిందనుకుంటారు. ఆ తర్వాత తెరలు తొలిగిపోయి, అసలు విషయం బయట పడుతుంది. వివాహ యోగ్యుడైన, యింత మంచివానిని యిటువంటి సత్పురుషుని, ఏ లలిత మాత్రం ఎందుకు వొదులుకుంటుంది? .... ప్రధాన కథకంటె పద్మనాభం ఉపకథ బాగా రక్తి కట్టింది. షూటింగు చూడాలనే ఆత్రం, వాహినీ గేటు కాపలా, ఆటోగ్రాఫుల వేట, వెండి తెర ప్రపంచంలోని తళుకులు, వాటిపట్ల ప్రేక్షకులకు గల ఆసక్తి - యిలాటివి హాస్యస్ఫోరకంగాను, ఆహ్లాదజనితంగాను వున్నాయి. దర్శకులు: హేమాంబరధరరావు.

—యన్నార్ చందూర్ సమీక్ష

'జగతి' - ఆగస్టు 1965



# కొత్త పుస్తకాలు

పిల్లల మనస్తత్వ శాస్త్రం - రచన: ధూర్జటి సుబ్బారావు. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ 4-1-435, విజ్ఞానభవన్ బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001. అరవ ముద్రణ. వెల: రు. 12-00.

జీవితంలో సరియైన విలువలను పెంపొందించుకొనేలాగు పిల్లలను తీర్చి దిద్దటంకోసం పెద్దలందరు చదవవలసిన పుస్తకం. పిండం ఏర్పడిన దగ్గర నుంచి యవ్వనదశ చేరేవరకు - జరిగే మార్పులు అన్నీ సైంటిఫిక్‌గా వివరించారు. ప్రతిపిల్లకి, పిల్లడికి ప్రత్యేక వ్యక్తిత్వం వుంటుంది. ఆ వయసుల్లోని నలుగురైదుగురి పిల్లల మధ్య భేదాన్ని సమానత్వాన్ని చూసుకుని, తమ పిల్లల మానసిక, శారీరక స్థితిగతులు అంచనా వేసుకుని, తల్లి దండ్రులు వారిని సరైన పౌరులుగా తీర్చిదిద్దాలని విశదీకరించారు రచయిత. ఏ వయసుకి తగినట్లుగా ఆ వయసు పిల్లలకి ప్రత్యేకమైన వాతావరణం కల్పించి సరైన మార్గంలో నడిపించే బాధ్యత పెద్దలమీద వుంది. ఆ ప్రయత్నంలో మనం ఎదుర్కొనే సమస్యలు, నిత్య జీవితంలోని యిబ్బందులు, ముఖ్యంగా వ్యతిరిక్తత స్వతంత్రత - చక్కగా విడమరిచారు. చిన్నపిల్లల్ని, బడికి వెళ్లేపిల్లల్ని మిగతా పౌరులతో సరిసమానంగా గౌరవించాలి, ఆదరించాలి. ఎనిమిదేళ్ల పిల్లలుకూడ వ్యక్తిత్వము గలవారే. వాళ్లకూడ జీవిత ప్రయాసలకు, ఒడిదుడుకులకు గురి అవుతారు - అన్న విషయం ముఖ్యంగా గమనించాలి. "సరైన త్రోవ యిది ఒక్కటే" అని ఎవరూ చెప్పలేరు కనుక బాలబాలిలను పెద్దలు అన్నిటిలోను విశ్వసించాలి.

✢ ✢ ✢

కెమిస్ట్రీ కథలు రచన: ఎన్. సి. గోపాలచారి. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్: హైదరాబాదు - 500 001, నాల్గవ ముద్రణ. వెల: రు. 8-00.

ఇందులో గాలి, మూల పదార్థములు, రేడియో యాక్టివిటీ, రసాయనిక ఎరువులు, చాకలిసోడా - ఈ అయిదు విషయముల గురించి కథలున్నాయి. ఇవి రసాయినిక శాస్త్రానికి సంబంధించినవి. గాలి అనగా ఏమిటి? అందులో ఏ ఏ వాయువులున్నాయి? వాటి మిశ్రమములు ఏమిటి? ఈ

సిద్ధాంతాలు, ఈ శాస్త్ర పురోభివృద్ధికి పాటుపడిన వైజ్ఞానికులు, వారి ప్రయోగాలు గురించి, బున్సెన్ బర్నర్ నుండి నేటి ట్యూబ్‌లైట్ల వరకు 'గాలి కథ' లో వున్నాయి.

'మూలపదార్థముల కథ'లో మూల పురుషుడు బోయిల్ వంటి వారి గురించి, యటామిక్ టేబిల్ రూప కల్పన చేసిన డాల్టన్ గురించి వివరంగా చెప్పారు.

'రేడియో యాక్టివిటీ కథ' లో క్యూరీ దంపతుల పరిశోధన, రేడియమ్‌ను కనుగొనుట, రేడియో ధార్మికశక్తి, ఐసోటోప్స్ ఇలాటివి విపులీకరించారు. ఈ రేడియోధార్మికత లోని కిరణప్రసారములు, ఆల్ఫా, బీటా, గామా కిరణాలు ప్రజా జీవన పురోభివృద్ధికి ఏవిధముగా ఉపయోగ పడుతున్నదీ చక్కగా చెప్పారు. గామా కిరణ ప్రసారంవల్ల మ్యుటేషన్లను సృష్టించి హెచ్చు దిగుబడిని పంటలో కలిగించారు. శాంతియుత ప్రయోజనాలకు అణుశక్తి ఏవిధముగా వుపయోగపడుతున్నదీ అందరూ తెలుసుకోవాలి.

'రసాయనిక ఎరువుల కథ' 'చాకలిసోడా కథ' ఆసక్తిదాయకంగా వున్నాయి.

—వాణీ మోహన్

'అతడు - ఆమె ; మనం' .... సమీక్షావ్యాసం. రచన : ఓల్గా, కాపీలకు : నవోదయా పబ్లిషర్స్ విజయవాడ - 2 .... వెల: రు. 5-00.

ఈ పుస్తకం వెలువడి అయిదు సంవత్సరాలకు పైగా గడిచినా సమీక్షా గ్రంధాలు ఎప్పటికీ నిత్య నూతనమే! ఉన్నవ లక్ష్మీనారాయణ 'మాలపల్లి' తర్వాత మన జాతీయోద్యమ నవలల్లో ఘనంగా పేర్కొన దగినది ఉప్పల లక్ష్మణరావు 'అతడు - ఆమె'

ఎమ్మే పాసైన శాంతం, అడ్వకేట్ శాస్త్రి ఒకర్నొకరు గాఢంగా ప్రేమించు కుంటారు ; పెళ్లి చేసుకుంటారు.

అయితే, ఉప్పు సత్యాగ్రహం శాంతంని గాంధేయవాదిగా ఆదర్శ భారతనారిగా మారుస్తుంది. శాస్త్రి నేమో ప్రయోజకత్వం మీద, పేరు ప్రఖ్యాతుల మీద దృష్టి నిలిపే అవకాశవాదిగా మారుస్తుంది. ఇద్దరిదీ చెరో దారి అయినప్పటికీ వారి గృహ శాంతికి యిబ్బంది కలగదు. ప్రేమ బంధం సడలదు. తనలోని అల్పత్వాలకు అంధుడుగాని శాస్త్రి, శాంతంలోని మనోధృతికి, నైతికశక్తికి తల వంచుతాడు.

పదిహేనేళ్ల పేదపిల్ల శుభని చేర దీసి తన స్వంత కూతురిలా పెంచు తుంది శాంతం. మాతృ వాత్సల్యం చూపడంలో, తన కడుపున బుట్టిన లక్ష్మికి, శుభకి ఎటువంటి వ్యత్యాసం లేని ఔన్నత్య శిఖరం అందుకుంటుంది. ఈ విషయంలో శాస్త్రి కూడా ఉన్నతుడే! నవల మూడో భాగం పూర్తయే సరికి లక్ష్మి పదహారేళ్లమ్మాయి : తన కంటె వయసులో పెద్దది, చుట్టూ తిరుగు తున్న ముగ్గురిలో ఎవరిని నిర్ణయించు

కోవడమా అని తికమకపడుతున్న శుభతో లక్ష్మి: 'నీవు ప్రతిదీ స్వీయాత్మికంగా ఆలోచిస్తావ్ - సమాజపరంగా ఆలోచించడం నేర్చుకోవాలి'

భార్యది గాంధేయపథం; భర్తది లౌకిక మార్గం. వారి అమ్మాయి లక్ష్మిని చైతన్యవంతం చేసేది సోషలిస్టు స్వప్నం. ఒక సాహస కార్యం ద్వారా దేశభక్తి ప్రకటించుకోవాలని ఆత్రపడే పె బూర్జువా మనస్తత్వం శుభది.

ఉప్పల లక్ష్మణరావుకి, ఆయన సతీమణి మెల్లీకి సత్యాగ్రహసమరంతో సన్నిహిత బాంధవ్యం ఉంది. 1929 లాహోరు కాంగ్రెస్‌కి వారిద్దరూ వెళ్లారు. వైస్రాయి ఇర్విన్ గాంధీజీకి వ్రాసిన లేఖను జర్మను భాషలోకి అనువదించినది మెల్లీయే! సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మాన ఫలితంగా జరగలేదు ఉప్పుసత్యాగ్రహం. గాంధీజీ వైస్రాయికి వ్రాసిన లేఖలోని అంశాలు అందుకు భిన్నమైనవి .... చారిత్రకాంశాలు చెబుతూ, రసాత్మక దృష్టితో పాత్ర విశ్లేషణ గావించిన రచయిత్రి ఓల్గా అభినందనీయురాలు.

—యస్సెస్







## ఈ మధ్య అందినవి :

కథానిక - 2 ; కృష్ణమూర్తి - 2 ; tact - Theosophical Appro ch to Contemporary Times....... ... ఒకొక్కటి నాలుగేసి సంచికలకు చందా పది రూపాయలు .... ప్రాప్తి బుక్స్, పిబి 5018, బెసెంట్ నగర్, మద్రాసు-90.

డాక్టర్ ॥ చంద్రశేఖరం ప్రశంసలు, అభినందనలు. డా॥ చంద్రశేఖరం ఆర్ట్స్ ప్రొమోషన్ కౌన్సిల్, మద్రాసు - 18 .... రు. 2-00

నటన దీక్షాపరుడు - డా॥ చంద్రశేఖరం. రచన : కృష్ణానంద్, రంగ జ్యోతి బుక్స్, మద్రాసు - 18.... రు. 40-00.

ధర్మ పథంలో జీవనరథం. రాలం : మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది. అనువాదం : యస్సెమ్ మలిక్. తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, హైదరాబాదు - 2 .... రు. 10-00.

మనసు గారడి - మనో వైజ్ఞానిక రచనలు .... వాసిరెడ్డి సీతాదేవి .... వికాసం పబ్లిషర్స్. హైదరాబాదు - 28 .... రు. 25-00.

ఫెమినిజం - కొన్ని ప్రశ్నలూ సమాధానాలు. ఆంగ్లమూలం : కమలా భాసిన్, నిఘాత్ సయద్‌ఖాన్. అనువాదం : నాగమల్లీశ్వరరావు .... రు. 2-00 ; మూడు తరాలు - అలెగ్జాండ్రా కొల్లంటాయ్ - అనువాదం ; ఓల్గా .... రు. 3-00 ; మాకు గోడలులేవు - ఫెమినిజం పరిచయం .... రు. 10-00 .... పై పుస్తకాల ప్రచురణ : ఫెమినిస్ట్ స్టడీ సర్కిల్ - 231/ఎ రోడ్ 36, జుబ్లి హిల్స్, హైదరాబాదు - 34.

శ్రుతి లయలు - నృత్య నాటికలు. డా॥ యన్. మంగాదేవి .... న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, గుంటూరు .... రు. 25-00.

మాండూక్యోపనిషత్తు - మండ చిన్న రామమూర్తి, రామ్‌నగరం - వయా కొత్తూరు, శ్రీకాకుళం జిల్లా.... మూల్యం : ఆనందం.

సైన్సు సంగతులు - డా॥ కెబి గోపాలం .. రు. 12-00 ; - గురుజాడ కవితలు ... రు. 18-00 ; రచయితా - శిల్పమూ : తుమ్మల వెంకట రామయ్య - తృతీయ ముద్రణ.... రు. 6-00 ; పసిడి పలుకులు - బాల గేయాలు. సమతారావు ... రు. 6-00 ; తెలుగు వెలుగులు - బాల గేయాలు. సమతారావు .. రు 6-00 ; వ్యాధులు - వైద్యం, డా॥ పరుచూరి రాజారామ్ .... రు. 6-00. .... పై పుస్తకాలన్నీ ప్రచురించినవారు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్, 4 - 1-435, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001. బ్రాంచీలు : విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం, హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

అందుకున్నవన్నీ గాకపోయినా, కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి. ✱

## 1776 జులై - ఆ నాలుగు రోజులు

# స్వాతంత్ర్య పత్రం

మూడవ జార్జి, పదమూడు వలసలకు బుద్ధి చెప్పాలనే మూర్ఖపు పట్టుదలతో ఉన్నాడు. ఈ పద మూడు వలస ప్రభుత్వాలూ ఒకటై నిలిచి, స్వాతంత్ర్య పత్రాన్ని ప్రకటించాయి. అదే యుద్ధ శంఖారవం.... ఇక చదవండి.

మౌల్ట్రీ వద్దకు ఒక వార్తాహరుని పంపించాడు ఛార్లెస్ లీ. "మీరు తుపాకులు ధ్వంసచేసి వెనక్కి వెళ్ళండి" అని ఛార్లెస్ లీ సందేశము. మౌల్ట్రీ అతని సైనికులు కోటని వదలి వచ్చేందుకు నిరాకరించారు. "మాకు కావలసింది మందు గుండు సామాను అది పంపండి" అన్నారు. వెనక దారినుంచి అయిదువందల పౌనుల మందు గుండు సామాను మౌల్ట్రీకి అందచేయబడింది.

కోటనుంచి తిరిగి ఫిరంగులు పేలే సరికి సర్ పీటర్ మరింత ఆగ్రహావేశ డయాడు. సాయంత్రము అయిదు గంటలయాక విప్లవ సేన పతాకాన్ని పడగొట్టారు ఆంగ్ల నౌకాదళము వారు. ముందు గోడ వెనుక భాగాన పడిపోయింది. మౌల్ట్రీ సైనికులలో ఒకడైన జాస్పర్ క్రిందికి దిగి వెళ్ళి ఆ పతాకాన్ని తీసుకు తిరిగి మరొక కొయ్యకి తగిలించాడు. నాలుగు వందల గజాల దూరాన యుద్ధ నౌకలు తుపాకులు పేలుస్తున్నాయి. అయినప్పటికి సార్జెంట్ జాస్పర్ ఆ పతాకాన్ని చేతబుచ్చుకుని ఎంతో పదిలంగా పైకి ఎక్కి స్వాతంత్ర్యము అను అక్షరాలు లిఖింపబడ్డ ఆ నీలి పతాకాన్ని యథా స్థానములో ఎగురవేశాడు. బ్రిస్టల్ నౌకలోని సర్ పీటర్‌కి మతిపోయినట్లయింది. 'ఈ విప్లవ సైనికులు రాక్షసుల వలె వున్నారు. ప్రాణాలకి తెగించి పోరాడుతున్నారు.' సర్ పీటర్ వేసుకున్న దుస్తులు చిరిగి పోయాయి. కోటు వెన్ను మీద చిరిగిపోయింది. పాంట్ చిరిగిపోయింది. అతనికి చాలా అవమానముగా వున్నది. కోట వంక చూస్తూ పిడికిలి బిగించి శత్రుకోటని శపించాడు. తన నౌకాబలంలో సగము ధ్వంసమైంది. తన ఆకారము, అహంకారము దెబ్బ తిన్నాయి నౌకాధిపతిగా తాను ఏనాడూ ఇంతటి అవమానాన్ని పొందలేదు. నెమ్మది నెమ్మదిగా చీకటి పడుతోంది. ఇరుపక్షాల నుంచి ఫిరంగులు నిర్విరామముగా పేలుతూనే వున్నాయి. ఈ కోటని కాళ్ళబేరానికి తీసుకొనిరాలేనని సర్ పీటర్ గ్రహించాడు.

ఆ రాత్రి తొమ్మిదీ పది గంటల వేళ సర్ పీటర్ తన నౌకా బలాన్ని అచ్చట నుంచి వుపసంహరించుకున్నాడు. దెబ్బ తిన్న ఓడలు చడీ, చప్పుడూ లేకుండా సముద్రములోకి జారుకుని వుత్తర దిశగా న్యూయార్క్ వైపు ప్రయాణం సాగించాయి. ఛార్లెస్టన్ లోని ప్రజలు ఆశ్చర్యపోయారు. ఆనందాతిరేకంతో గంతులు వేశారు. ఒక పెద్ద బరువు దించినట్లయి, భగవంతునికి కృతజ్ఞత తెలుపుకున్నారు.

జులై రెండవ తేదీన ఛార్లెస్ లీ కాంగ్రెస్ సమావేశానికి ఆనాటి యుద్ధ సమాచార నివేదిక పంపుతూ మౌల్ట్రీ అతని సైనికులూ చూపిన ధైర్య సాహసాలు నిరుపమానములు అంటూ మెచ్చుకున్నాడు.

దక్షిణ కెరోలినా నుంచి ముట్టడిదార్లు తరిమి వేయబడ్డారు. బ్రిటిష్ నౌకా సేనలు అధిక సంఖ్యలో న్యూయార్క్ రేవు పట్నం చుట్టూ చేరుకుంటున్నాయి. జులై రెండవ తేదీ సాయంత్రం ఆరుగంటల వేళ రక్షణ సేనలోని సైనికుల నుద్దేశించి వాషింగ్టన్ అన్నాడు: "అమెరికనులు స్వాతంత్ర్య పౌరులుగా జీవించదలచుకున్నదీ, బానిసలుగా వూడిగము చేయదలచుకున్నదీ నిర్ణయించుకోవలసిన పరీక్షా సమయము ఆసన్నమవుతోంది. ఈ పరీక్షకు మీరు సంసిద్ధులు కావాలి."

## జులై మూడవ

బుధవారము ఉదయము తొమ్మిది గంటల వేళ హాన్‌కాక్ సభ ప్రారంభించాడు. కార్యక్రమ విధానము యథారీతిని సాగుతోంది. న్యూయార్క్ నుంచి మనుషులు, ఆయుధాలు కావాలని జనరల్ వాషింగ్టన్ జరూరు విన్నపం. క్రౌన్ పాయింటు నుంచి బెనిడిక్ట ఆర్నాల్డ్ నౌకల మరమ్మత్తుకు వడ్రంగులు కావాలని విన్నపము. రాష్ట్ర అసెంబ్లీల వద్ద నుంచి నివేదికలు - యితర కమిటీల నివేదికలు; చెల్లించవలసిన బిల్లులు; ఇతర విన్నపాలు.... ఈ దైనందిన విషయాల కంటే ఆనాడు పరిశీలించ వలసిన ముఖ్య విషయమై ప్రతినిధులు తొందరపడుతున్నారు.

కళ్ళద్దాలు ధరించిన డాక్టర్ ఫ్రాంక్లిన్ వాద ప్రతివాదాలు వింటుటున్నాడు. న్యూజెర్సీ గవర్నర్ విలియమ్ ఫ్రాంక్లిన్‌ని బందీచేయాలని రెండు వారాల క్రితము కాంగ్రెస్ సభ చేసిన తీర్మానపు ప్రతి, స్పీకర్ బల్లమీద వున్నది. కొందరు ప్రతినిధులు ఫ్రాంక్లిన్ వంక ఓరకంటితో చూస్తున్నారు. కొడుకును అరెస్టు చేయడము అతనికొక దెబ్బ అని భావిస్తున్నారు వారు.

పోయిన మే నెలలో విలియమ్, లండన్ నుంచి తిరిగివచ్చిన వెనుక డాక్టర్ ఫ్రాంక్లిన్ అతనిని స్వాతంత్ర్యము వైపుగా కృషి చేయమని చెప్పాడు. కాని నలభై సంవత్సరాలు

పైబడ్డ కొడుకు, తండ్రిమాట లెక్క చెయ్యలేదు. విలియమ్ సుశిక్షణలోనే పెరిగాడు, మిడిల్ టెంపుల్‌లో న్యాయ శాస్త్ర మభ్యసించాడు. తండ్రికిగల పలుకుబడి వల్లనే ఈ పుత్రునికి గవర్నర్ వుద్యోగము లభించింది. కాని తండ్రికి గల మనోవైశాల్యమూ ప్రజాహితాభిలాష ఇతనిలో లేవు. 'ఈ గవర్నరు వుద్యోగము పోతే తన భవిష్యత్ ఏంగాను? తన ముఖం ఎవరు చూస్తారు?' అని విలియమ్ ఫ్రాంక్లిన్‌కి బాధగా వుండేది. ఆ కారణముగా అతను రాజ వర్గీయులతో చేతులు కలిపి విప్లవాన్ని అణిచివేయడానికి సాయబడుతూండేవాడు. తండ్రి స్వాతంత్ర్యము కోసమై ప్రాణాలర్పించడానికి సిద్ధంగా వుండగా, తనయుడు అధికారాన్ని పట్టుకు దేవుళ్ళాడుతూ అమెరికా కాంగ్రెస్ సభవారిచే స్వాతంత్ర్య విరోధిగా పేర్కొనబడ్డాడు. నేడో రేపో అతనిని జైలుకి పంపిస్తారు. ప్రతినిధులు ఏమిటేమిటో అనుకుంటున్నారు గాని బెంజిమిన్ ఫ్రాంక్లిన్‌కి తత్సంబంధమైన ఆందోళనగాని చింతగాని లేదు. ఒకే కుటుంబంలో గల అంతర్యుద్ధమిది - అని ఒక్క మాటలో సరి పెట్టుకోగలిగాడు.

డాక్టర్ ఫ్రాంక్లిన్ ఇరవై సంవత్సరాల బట్టీ బ్రిటన్‌ని తన వలస విధానములో కొంచెము దయాదాక్షిణ్యాలూ మానవధర్మమూ చూపమని తన శక్తి సామర్థ్యాలని వినియోగించాడు. దౌర్జన్య విధానంపట్ల అతనికి మొదటినుంచీ అయిష్టమే. అతని మనసూ ఆత్మా దౌర్జన్య భావనకు వ్యతిరేకములు. గర్విష్ఠులైన బ్రిటిష్ మంత్రులు ఈ అమెరికా ప్రజలను తేలిక భావముతోనూ అసహనముతోనూ చూడ్డముతో శాంతి మార్గాన తను జరుపుతున్న ప్రయత్నములన్నీ నిరుపయోగములనీ, బ్రిటిష్ ప్రభువులను తమ అనునయవాక్యాలు చేతగానివారి బెదిరింపులలా కన్పిస్తున్నాయని, బల ప్రదర్శనతోగాని ఈ సమస్య పరిష్కరింపబడదనీ తెలుసుకున్నాడు డాక్టర్ ఫ్రాంక్లిన్. అయన ఫిలడల్ఫియా వచ్చినప్పటినుంచీ అనేక ఉద్యమాలలో పాల్గొంటున్నాడు. పోస్టుమాస్టర్ జనరల్‌గా తపాలాశాఖను పునర్నిర్మించాడు. ప్రభుత్వ ఖజానాకు కార్యదర్శిగా కాగితపునోట్లు అచ్చొత్తించే విధానము తెలిపి, ఈ రూపేణా బిల్లులు చెల్లించమన్నాడు. రక్షణకమిటీ అధ్యక్షునిగా పౌర క్షేమానికి చెందిన కట్టుదిట్టాలు చేయిస్తున్నాడు. డెలవార్ ప్రాంతానగల పాతకోటలు కందకాలు బాగుచేయించి శత్రుదాడిని ఎదుర్కొనేందుకు సంసిద్ధము చేయిస్తున్నాడు. నౌకా నిర్మాణము, నదీజలాలను కాపాడుకోడము, మందుగుండు సామానూ కవచాల తయారీ, ప్రథమ చికిత్స, ఎమర్జెన్సీ ఆస్పత్రులు ఇటువంటి రక్షణ ప్రయత్నాలలో నిమగ్నుడై వున్నాడు.

మార్చి నెలలో ఫ్రాంక్లిన్ ఒక రాయబారవర్గానికి ఆధిపత్యము వహించి కెనడా వెళ్ళి అక్కడగల ఫ్రెంచి కాథలిక్కులను అమెరికనులతో చేయిగలపమని కోరాడు. వారుకూడా తమతో చేరి బ్రిటన్‌ని ఎదిరిస్తే విప్లవము తొందరలో జయప్రదమవుతుందని ఫ్రాంక్లిన్ భావించాడు. కాని వారితో జరిపిన సంభాషణలు విఫలమయాయి.

స్వాతంత్ర్య తీర్మాన ముఖ్య రచయితలు అయిదుగురిలో ఈయన ఒకడు. అధ్యక్షుడు హారిసన్ మధ్యాహ్నము ఒంటిగంట అయాక, తన కంఠం సరిచేసుకుని చదువనారంభించాడు. "అమెరికా సంయుక్త రాష్ట్రాల కాంగ్రెస్ సభలోని ప్రతినిధులు సమావేశమై ప్రకటించిన ముఖ్య పత్రము ...." హారిసన్, కార్యదర్శి థామ్సన్ వైపు తిరిగి "ఇదిగో యిక నీవు చదువు" అని తను శీర్షిక మాత్రము ప్రకటించి, పాఠ్యభాగము కార్యదర్శిని చదవమన్నాడు. థామ్సన్ తన స్థానములో నిలబడి ఇలా చదవడము మొదలుపెట్టాడు.

"మానవ చరిత్రలో, కొన్ని సంఘటనల పరిణామఫలితముగా, ఒక దేశ ప్రజలు, మరొక దేశము తమపై విధించిన రాజకీయ బంధాలు నెమ్మదిగా సడలించుకొని, కరుణామయుడైన భగవంతుడు అనుగ్రహించిన

ప్రకృతి సంపదలో గలసర్వ సమానత్వ సూత్రానికి తాము కూడా వారసుల మని నిరూపించుకోవలసిన అగత్యం ఏర్పడుతుంది. రాజకీయ దాస్య విమో చనకై తమ ఆత్మగౌరవము, స్వాతం త్ర్యము పరమపవిత్రములని భావిస్తూ, తమ ప్రజలు ఏకారణాలవల్ల బంధ విమోచనా ప్రయత్నము చేస్తున్నారో, సభ్యమానవాళికి విడమరిచి చెప్పగల నైతిక భారము కూడావున్నది'' - చాలా మంది అవునన్నట్లు తలలూపారు, ఏ ఒక్కరూ అభ్యంతరము తెలుపలేదు. జఫర్‌సన్ వాక్యవిన్యాసములో ఒక సొగసు వున్నదనీ అది ధారావాహి కంగా సాగుతోన్నదనీ ప్రశంసించారు.

"మేము కొన్ని సత్యములను ప్రత్యక్షదార్శనికములుగా భావిస్తు న్నాము. భగవంతుడు మానవులను సృష్టించినపుడు వారందరినీ స్వతం త్రులుగా సమానులుగా సృష్టించాడు ఇది ప్రతి ఒకరికీ గల పవిత్రమైన హక్కు. దీనిని ఎవరూ కాదనలేరు. మీరు కోరిన జీవితము, మీరు వాంఛించే స్వాతంత్ర్యము, మీకు తృప్తినిచ్చే సౌఖ్యము - ఈ మూడు మీకు కరుణామూర్తియైన భగవం తుడు ప్రాణదానంతో బహూకరిస్తు న్నాడు. తమకు గల ఈ ప్రాథమిక హక్కులను కాపాడేందుకే, మానవులు సంఘముగా ఏర్పడి, తమకు నచ్చిన ప్రభుత్వాలను ఏర్పరచుకు, తమ శ్రేయస్సుకోసం, తమ అభీష్టప్రకారము, ఆ ప్రభుత్వాలను పాలన సాగించమం టున్నాయి. ప్రతి ప్రభుత్వమూ తన ప్రజలకోసమై నిర్మితమవుతున్నది. ఏనాడైతే ప్రభుత్వము తన ధర్మాన్ని విస్మరించి, ప్రజాశ్రేయస్సు కోసం నిర్మితమయాననే విషయాన్ని మర్చి



పోతుందో, అప్పుడు ప్రజలకు ఆ ప్రభుత్వాన్ని మార్చగల హక్కు, నిర్మూలించగల హక్కు, నూతన ప్రభుత్వ స్థాపనకి కృషి చేయగల హక్కు, వాటంతటవే సంక్రమిస్తున్నాయి. సిద్ధాంతాలలోను, శక్తుల సమీకరణలోను ఏ ప్రభుత్వమైనా సరే, ఎల్లవేళలా తన ప్రజలక్షేమము. రక్షణ - ఇవే పునాదిరాళ్ళుగా భావించాలి. పాలనాధికారమనగా, తమ క్షేమలాభాల నిమిత్తము ప్రజలు పాలకులకు అప్పగించిన అధికారము. ఆ సత్యము పాలకులు మర్చిపోయిన నాడు స్వాతంత్ర్య ప్రియులైన ప్రజలు, అది వారికి గుర్తు చేయక తప్పదు."

అద్భుతముగా వుందనుకున్నాడు థామ్సన్. స్వాతంత్ర్య ప్రభుత్వ లక్ష్యాన్ని ఒక్క ముక్కలో సూక్ష్మీకరించి చెప్పాడు. పదగుంఫనతో గంభీర వేగాన నడుస్తున్న భావాలను ఒక్కటొక్కటే చదువనారంభించాడు థామ్సన్.

"సుస్థిర ప్రభుత్వాలు స్వల్ప కారణాలకు తమ పాలనాపద్ధతిని మార్చుకోనవసరంలేదు .... కాని, ప్రభుత్వమే తన అధికారాన్ని దుర్వినియోగ పరుస్తున్నప్పుడు, అక్రమాల సంఖ్య అనాటికానాడు ఎక్కువవుతున్నపుడు .... అది నియంతృత్వానికి దారి తీస్తుంది. తాను చెప్పినదే న్యాయమను మూఢత్వానికి లొంగిపోయినట్లవుతుంది. ఏనాడైతే ప్రభుత్వము అధికారబలమే, తన పాలనకు ప్రాతిపదికగా చేసుకుంటుందో, అప్పుడు పాలితులైన ప్రజల ప్రథమకర్తవ్యం - అటువంటి నిరంకుశ ప్రభుత్వాన్ని కూలద్రోయడమే! అది వారి జన్మ హక్కు, పవిత్రబాధ్యత. ఈనాడుఅటువంటి విపత్కర పరిస్థితి ఏర్పడింది. నేటి బ్రిటిష్ ప్రభుత్వ చర్యలు ప్రజలను కించ పరుస్తున్నాయి. న్యూనత పరుస్తున్నాయి. ఏదో రీతిని అధికారాన్ని కైవశం చేసుకోవడమే ముఖ్యంగా భావిస్తున్నాయి, మా మాటలు కాదనగల ధైర్యమే బ్రిటన్‌కి వుంటే, ప్రపంచ ప్రజలముందు సత్యాసత్యాలని వెల్లడించమనండి."

థామ్సన్ ఒక్కక్షణం ఆగాడు. కొన్ని కొన్ని ప్రయోగాల విషయములో కొంత చర్చ జరిగింది. కొన్నిపదాలు అక్కడక్కడ మార్చారు. కాని మొత్తము మీద ఈ ప్రకటనలో అమెరికన్ ప్రజాహృదయము ప్రతిబింబితమయింది. ఈ స్వాతంత్ర్య ప్రకటనలో సర్వమానవాళినీ ఉద్దేశించిన పిలుపు ఒకటున్నది. సన్మార్గవర్తనులైన ప్రజలు, మా తప్పేమిటో చెప్పండి అన్న సవాలు వున్నది. నిష్పాక్షిక దేశాలు, సజ్జనులైన ప్రజలు తమపట్ల గలరని అమెరికనులకి దృఢవిశ్వాస మేర్పడింది. కార్యదర్శి ఒక్కొక్క పేరాయే చదువనారంభించాడు.

(ఇంకా వుంది

—మాతృక : కార్నెల్ లెన్‌గ్వెల్

—తెలుగు : యన్నార్ చందూర్

# నా చిన్ననాటి ముచ్చట్లు

## కె యన్ కేసరి



'గృహలక్ష్మి' కంకణ గ్రహీతలైన తెలుగు వనితలు ఈనాడు ఎందరో ఉన్నారు. 'గృహలక్ష్మి' పత్రిక ద్వారా స్త్రీ జనాభ్యుదయానికై కేసరి గారు చేసిన అద్వితీయ కృషి తెలుగువారు మరువలేనిది. అలాగే కేసరీ కుటీరం, కేసరీ విద్యాలయం వంటివి, ఆయన పేరు చిరస్థాయిగా నిలిపే సంస్థలు, ఆత్మబలం, స్వయంకృషి, అచంచల దీక్షతో, వైద్య శాస్త్రంలోని ప్రతిభను ప్రజోపకరంగా మార్చి, సేవా తత్పరతతో చరితార్థులైన కేసరిగారు తమ జ్ఞాపకాలను పుస్తకరూపంలో 1953 లో వెలువరించారు. ఆదర్శ ప్రాయులు, పుణ్యాజీవనులు అయిన ఆ మహానుభావుని జీవిత విశేషాలు అనాటి సాంఘిక పరిస్థితులకి దర్పణం వంటి అనుభవాలు - జులై నెల నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాము.



# ఆనాటి హోటళ్లు, తెలుగు భోజనం

ఆకాలమున కాలేజీలో చదువుకొనే విద్యార్థులకు హాస్టల్స్ లేవు. తెలుగు వారికి అరవహోటలు భోజనము సరిపడేదికాదు. అందువల్ల ఆంధ్రులు ఎక్కడనైనా ఒక్క రూమును చదువుకొనుటకు అద్దెకుతీసుకొని సామాన్య గృహస్థుల ఇండ్లలో డబ్బిచ్చి భోజనముచేసి చదువుకొనుచుండెడివారు.

ఆ రోజులలో టంకసాలవీధిలో కాశీపాటి (వారింటి పేరు కాశీవారు ; ఆమెను - పాటి అనగా అరవంలో అవ్వా అనేవారు) హోటలులో కంది పప్పు పచ్చడి, వేపుడుకూరలు వడ్డించేవారు. అందువల్ల కొందరాంధ్రులు అక్కడి చేరసాగినారు. ఈ హోటలులో అరవలు, ఆంధ్రులు కలిసి యుండుట వల్ల భోజనపదార్థములలో పేచీ వచ్చి, ప్రతిదినము పిల్లకాయలు దెబ్బలాడు కొనుచుండేవారు. ఇందువల్ల ఆమె తెలుగువారిని తన హోటలుకు రావద్దని వెళ్లగొట్టినది.

ఆ సమయంలోనే అమ్మాయమ్మయను తెలుగుఆవిడ తెలుగువారికి ప్రత్యేకంగా హోటలు పెట్టి, తెలుగువారికి సరిపడు వంటకములనుచేసి, పిల్లకాయలను తృప్తిపరచు చుండెను. ఆకాలమున హోటలుకు నెలకు రు.7 లు మొదలు రు. 10ల వరకు ఇవ్వవలసి యుండెడిది. అమ్మాయమ్మయు తెలుగువారివద్ద రు. 10 లు వసూలుచేసెడిది. కాని వీరికి వేపుడుకూరలు, కోరినపచ్చళ్లు, ఆవకాయ, ఊరగాయ, వగైరాలు - ఇవి కలుపుకొన్నప్పుడెల్లా ముద్దముద్దకు బారెడేసికమ్మని నేయి - ఈ విపరీతపుఖర్చుకు తట్టుకోలేక పోయినది. ఆమె వీరల భరించజాలక హోటలుముగించితలుపు మూతమూసినది.

క్రమముగా ఆంధ్రవిద్యార్థులు మద్రాసులో విస్తారమైనారు. కొందరు విద్యార్థులు భోజమునకై ఈ ఇబ్బందులు పడలేక ఇక్కడ కాపురములే పెట్టుకొనసాగినారు. అయితె ఆంధ్రులకు అరవలుండు ఇండ్లలో కాపురమునకు స్థలము చిక్కుట దుర్లభమైనది. ఏలనంటే ఆంధ్రులకు ఆచారములేదు : మగవారు చుట్టలు త్రాగుచు ఎక్కడబడితే అక్కడ ఇల్లంతా ఉమ్మివేయు చుందురు ; బిడ్డలు ఇల్లంతయు చెరిచెదరు ; సాధారణముగా స్నానముచేయరు - అని అరవవారికి వీరియందొక అపోహ. ఇది కేవలము అపోహాయే కాదేమో !

సరిగా నిట్టిసమయంలో వంగవోలునుండి కొండపి రామకృష్ణరావు, గొట్టిపాటి బెంచు సుబ్బారాయుడుగార్లనే వారిరువురు మద్రాసుకు కాలేజీ విద్యకై వచ్చిరి. ఈ బెంచు సుబ్బారాయుడుగారు ఇప్పుడు హైకోర్టులో

జడ్జీగానున్న గౌరవనీయులగు శ్రీ చింతగుంట రాఘవరావుగారి మామగారు. చెంచు సుబ్బారాయుడుగారు చాలా ఆచారవంతులు. కాఫీ పుచ్చుకొనేవారు కారు ; చిరుతిండ్లు తినేవారు కారు ; శివార్చన చేయనిది భుజించేది లేదు : సత్యవంతుడు. ఇట్టివారికి నగరంలో భోజనవసతి దొరకుట కష్టసాధ్యము. వీరిరువురు మా స్వగ్రామ ప్రాంతమువారగుటచే కావోలు ఎట్టోనన్ను తెలిసి కలుసుకొన్నారు. ఎట్లైనా తమకు భోజనవసతి ఏర్పాటు చేయమని గట్టిగా కోరినారు. నేను అప్పుడు నాతల్లితో యోచించి, ఆమె చేయుచున్న పంటకొల్వును మాన్పించి, వీరిరువురికిని ఆచారముగ అన్నము వండిపెట్టు ఏర్పాటు చేసినాను. మేము అగ్రహారములో పెద్దగదిని అద్దెకు పుచ్చుకున్నాము. మాతల్లి అనుకున్న ప్రకారము వీరిరువురికిని వంటచేసి పెట్టుచువచ్చినది. చెంచు సుబ్బారాయుడు గారికి ఆచారమేగాకుండా కొన్ని భోజన నియమములుకూడ యున్నవి. ఈ ఊరి కాయగూరలను తింటే ఏమేమో జబ్బులు వస్తవి అని వారి భయము. అందువల్ల ఇంటినుండి చింతపండుపచ్చడిని, ధనియాలపొడిని తెప్పించుకొని, వాటితోను వారు మజ్జిగలతోను భుజించుచుండెడివారు. పండుగనాడు కూడా వారికదే భోజనం. చదువుకొనుటకు వారు యేర్పాటు చేసుకున్న రూముకు రాత్రిళ్ళు నేనుగూడ వెళ్ళి వారికి తోడుగా పడుకొనేవాడను. ఈ కారణమువల్ల వారికి నాకు మంచి స్నేహము కుదిరినది. వీరితో కూడయుండిన కొండపి రామకృష్ణరావుగారున్ను చాలా పెద్ద మనుష్యులు. వారిరువురితో నేను చాలా చనువుగా ఉండేవాడను.

ఇట్లుండగా నాతల్లి అకస్మాత్తుగా చనిపోయినది. మద్రాసులో నేను మరల ఏకాకినైనాను. నాకు భోజనమునకే కష్టమైనది. అయితే ఈసారి నాకు మరి ఇరువురు తోడైనారు. మా యింట్లో భోజనము చేయుచుండిన విద్యార్థులకు కూడ భోజనవసతి తప్పిపోయినది. మేము ముగ్గురమును చాల కష్టపడవలసి వచ్చినది. కాని దైవ మొక్కదారి చూపినాడు.

## నా రెండవ తల్లి నరసమ్మ

మేముండే ఇంటిలోనే జొన్నలగడ్డ నరసమ్మ అనే ఆమె కాపురమున్నది ఆమెను నేనాశ్రయించి వారిరువురికిని భోజనము వండిపెట్టుటకు వప్పించితిని. నరసమ్మ సమ్మతించుచు, మరి ఎవరినైనా కొంతమందిని కూడా కుదిర్చిన బాగుండుననెను. అప్పుడు నేను కావలి కాపురస్థులగు విస్సా రామారావు

'నిరిగా వెన్నెలకంటి కృష్ణస్వామిరావు గారిని, ఓరుగంటి వెంకటసుబ్బయ గారిని జతగూర్చితిని. అప్పుడదియొక చిన్న భోజనశాలయైనది. నరసమ్మ గారు వంటరియగుటచే ఆమెకుకావలసిన వస్తువులు తెచ్చియిచ్చుచు, నేను కూడ ఆ విద్యార్థులతో కూడా భోజనము చేయుచుంటిని. నరసమ్మగారు తెనుగువారి వంటలను రుచికరముగా చేయుటలో మంచినేర్పరులు. నరసమ్మ గారికి సంతానము లేదు. దైవికముగా కల్గిన మా పరస్పర సన్నివేశమువలన ఆమెకు నాయందు పుత్రవాత్సల్యమును, నాకామెయందు మాతృభక్తియు కుదిరి పెంపొందినవి. నా తల్లిపోయిన వెంటనే ఈవిధముగా దేవుడు నాకు మరియొక తల్లిని చూపుట నా అదృష్టమే.

# 4 కేసరికుటీర స్థాపనము

ఉద్యోగమునకై చేసిన పలువిధములైన ప్రయత్నములు విఫలములైన పిమ్మటనే వైద్యమును నేర్చుకొనుటకు ప్రారంభించితిని.

చల్లని తల్లి నరసమ్మగారి చేతి ప్రసాదముతో నాకు కాలము గడుచు చున్నది. కాని ఆమె మాత్రము నాకెంత కాలము భోజనం పెట్టగలదు? అనాధవద్ద ఉచితముగా భోజనం చేయుట నాకే అవమానముగ తోచినది.

## చిల్లరవృత్తులు వైద్యవృత్తికి దారితీసినవి

ఆ కాలమున మద్రాసులో తెలుగు బోయీలు చాలామంది యుండెడి వారు. వారు మద్రాసు బ్యాంకి, నేషనల్ బ్యాంకి, ఆగ్రా బ్యాంకి మొదలైన బ్యాంకులలో నౌకర్లుగా నుండేవారు. అప్పుడు మద్రాసు బ్యాంకి బ్రాడ్వే లోను, నేషనల్ బ్యాంకి ఆగ్రా బ్యాంకీలు ఆర్మీనియను వీధిలోను ఉండేవి. అక్కడి కొలువుచేసే బోయీలందరు ప్రతి ఆదివారము నావద్దకు వచ్చి వారి బంధువులకు జాబులు వ్రాయించుకొని పోయేవారు. కార్డు వ్రాసిన అర్ధణా; కవరు వ్రాసిన ఒక అణా ఇచ్చేవారు. ఈ ప్రకారము నాకు ఆదివారము కొంత డబ్బు వచ్చుచుండెను.

వైశ్యుల ఇండ్లలో పిల్లకాయలకు పాఠములు చెప్పుటవల్ల కొంత డబ్బును సంపాదించుచుంటిని. ఈ సంపాద్యము లాధారముగా నరసమ్మగారికి నెలకు రు. 3-00 లు చొప్పున ఇచ్చుచు భోజనము చేయుచుంటిని.

కోమట్ల ఇండ్లలో పిల్లకాయలకు పాఠములు చెప్పుటకు వార్ల పరిచయము నాకు అధికమైనది. ఆ చనువున వారు అప్పుడప్పుడు నాకు కొన్ని పనులు చెప్పి చేయించుకొనుచుండిరి. వీరి పరిచయమువల్ల క్రమముగ నాకు అన్నవస్త్రముల కరువు తీరినది. వైద్యమును నేర్చుకొన్నపిదప ముఖ్యంగా ఈ కోమట్ల ఇండ్లలో హెచ్చుగా వైద్యముచేయుట కవకాశము కల్గినది. వీరు నాకు రాజపోషకులైరి.

## శ్రీ కన్యకాపరమేశ్వరీ ఆయుర్వేద ధర్మశాలలో ఉద్యోగము

పిమ్మట వారి సహాయముననే శ్రీ కన్యకా పరమేశ్వరీ ఆయుర్వేద ధర్మ వైద్యశాలలో నౌకరిని సంపాదించుకొంటిని. ఏలననగ ఈ ధర్మవైద్యశాల కోమట్ల కుల దేవతయగు శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవాలయపు ధర్మకర్తలచే స్థాపించబడినది. ఈ దేవాలయములో ప్రతిదినము పేద బ్రాహ్మణ విద్యార్థులకు అన్నమును పెట్టుచుండిరి. ఆ కాలమున వైశ్యులకు బ్రాహ్మణ భక్తి అధికంగా నుండుటచే అన్నదానము ధారాళముగా జరుగుచుండెను.

## దేవాలయములో శరన్నవరాత్రములు - సంతర్పణలు

ప్రతి సంవత్సరమును శరన్నవరాత్రములలో ఉత్సవములకు ఈ కన్యకా పరమేశ్వరీ దేవాలయమున 9 దినములు బ్రాహ్మణ సంతర్పణ జరుగును. ఈ సంతర్పణలలో ప్రతి దినము 2000 బ్రాహ్మణులకు తక్కువ మనది లేకుండా భోజనమును చేయుచుండిరి. ఇక్కడ తయారుచేయు భోజన పదార్థములు వంకాయకూర, చారు వగైరాలు చాలా ప్రశస్తములుగా నుండెడివి. ఇట్టి అద్భుత పాకకళానిపుణులలో ముఖ్యముగా బుర్రా కుటుంబయ్యగారు, భీమవరం కాపురస్తులగు ములుకుట్ల సుబ్బయ్య, జాలయ్య, అప్పయ్య, వీరు యెన్నదగినవారు. ఇందులో జాలయ్య మంచి కసరత్తు చేసిన వస్తాదు. కొల్లా కన్నయ్య శెట్టిగారితోకూడ గరిడీని నేర్చుకున్నవారు.

వారారోజులలో ఆ తొమ్మిది రోజులకు 1116 ర్లు తీసుకొనేవారు. జిహ్వా చాపల్యము తీర్చుకొనుటకై అమ్మవారి ప్రసాదమని అభ్యంతరములేకుండాఆనాటి గొప్ప యిండ్లవారుకూడా ఏదో యొకరోజున పంక్తి భోజనమునకు వచ్చేవారు. ఏ కారణముచేనైన రాజాలని పెద్దలు ఆ ప్రసాదమందలి తీపిచే ఇండ్లకైన తెప్పించుకొని భుజించేవారు.

నేను దేవాలయమునకు సంబంధించిన నౌకరి నగుటచే ఆ తొమ్మిదిరోజులు వంటశాల భోజనశాలలకు, నన్ను సూపరింటెండెంటుగా నియమించేవారు. ఈ వంటశాలలోని నెయ్యి, బియ్యము, చక్కెర, కుంకుమపువ్వు, పచ్చకర్పూరము, ద్రాక్షవగైరా వెలగలసామానులు సామాన్యముగా చోరీ అగుచుండేవి. ఆచోరీలు జరుగకుండా జాగ్రత్తగా చూచుట, వంట చక్కగచేసి, వడ్డన శ్రద్ధగా జరుపుట మున్నగు కార్యములను గమనించుట నా పనులుగా నుండెడివి. ఎంత జాగ్రత్తగ నుండినను చోరీలు జరుగుచునే యుండెడివి.

## పార్వేట ఉత్సవము

విజయదశమినాడు అమ్మవారికి, గొప్ప పార్వేట ఉత్సవము జరుగును. ఆనాడు అమ్మవారికి, వజ్రములతో చెక్కబడిన అనేక ఆభరణముల నలంకరించి పూరేగించెదరు. మామూలుగా అమ్మవారు గిడ్డంగివీధి అనే వరదాముత్తియప్పన్ వీధిగుండపోవుట ఆచారము. ఈ వీధిలో విస్తారము మహమ్మదీయుల గుడ్డలగిడ్డంగులే. అప్పుడే ఆవీధి నడుమనొక మసీదునుకూడ కట్టించి యుండిరి. పోలీసుసిబ్బందితో అమ్మవారి ఉత్సవమును సాగించిరి. అమ్మవారి వెంటవచ్చు పోలీసుసిబ్బందిలో ముఖ్యులు వెల్డన్ యను దొరగారు. ఆయన ఆ కాలమున పోలీసుశాఖలో పేరుపొందిన వారిలో నొకరు. వీరితోకూడ మరి ముగ్గురు సార్జంటులు గుర్రములనెక్కి ముందు నడచుచుండిరి. అమ్మవారికి ముందుగా ముఖ్యధర్మకర్తలగు శ్రీ కొల్లా కన్నయ్యశెట్టిగారు, వారి చుట్టును ఇతర ట్రస్టీలగు వైశ్యులును నడుచుచుండిరి. వారివెనుక దేవస్థానపు నౌకర్లు. వారిలో నేనును, పండిత గోపాలాచార్యులు మున్నగువారు నుంటిమి. ఆ కాలమున అమ్మవారితోకూడ దివిటీలను పట్టుటకు 'సోమరివాండ్లు' అని యొక వర్గముండేవారు. వారు ఇనుప త్రిశూలములకు బిగించిన కర్రలనుతీసుకొని ఆ త్రిశూలములకు పాతగుడ్డలను గుండ్రముగాచుట్టి, నూనెలో తడిపి దివిటీలను వెలిగించి వెలుతురు చూపుచు వెంటనడిచేవారు.

వైద్యశాలలో నేను చేయుచున్న నౌకరితో, నా వైద్యవృత్తికి మెరుగు వచ్చినది. నా జీవితములోని కష్టములు చాలాభాగము మరుగైనవి. గోపాలాచార్యుల వారికిని నాకును మంచి స్నేహము కుదిరినది. గోపాలాచార్యులుగారు మద్రాసుకు క్రొత్తయగుటచే నేనువారికి కొంతసహాయమును చేయవలసివచ్చినది. మొదట వైద్యశాల గిడ్డంగి వీధిలో దేవాలయమునకు సంబంధించిన కొట్లలో యుండెను. ఈ వైద్యశాల యెదుటనే నా స్నేహితుడగు అన్నం చెన్నకేశవులు శెట్టిగారి యిల్లు. గోపాలాచార్యులుగారు నివసించుటకు స్థలములేనందున శెట్టి గారింట్లో, ఒక రూమును ఆచార్యులవారికి యిప్పించితిని. అప్పుడు నేను నరసమ్మగారికి నెలకు రు. 10లు ఇచ్చి భోజనముచేయుచు రాత్రిళ్లు శెట్టిగారి యింటిలోనే పండుకొనుచుంటిని. ఆచార్యులవారు, నేను, యిరువురము శెట్టిగారి యింట్లోనే యుండుట తటస్థించెను.

ఆచార్యులవారును నేనును వైద్యశాలలో 4 సంవత్సరములపాటు సోదర భావముతో కాలమును గడుపగల్గితిమి. ఆచార్యులవారు ఆయుర్వేదాశ్రమమను పేరుతో ఒక వైద్యశాలను స్థాపించి ముఖ్యముగ ప్లేగుమందుల మహాత్మ్యములను కరపత్రముల ద్వారా ప్రచురించుచు వ్యాపారమును సాగించిరి. నేను కేసరీ కుటీరమను పేరుతో వైద్యశాలను స్థాపించితిని. పనిచేయుచున్న వైద్యశాలలో నేనే మొదట రాజీనామా యిచ్చితిని. పిమ్మట కొంతకాలమునకు ఆచార్యులవారును రాజీనామా యిచ్చిరి. అప్పటినుండి స్వంత వైద్యాలయములను నడుపుకొనుచుంటిమి.

## 5 కేసరికుటీరం ప్రథమావస

కేసరీకుటీరమునకు మొదట చాలినంత మూలధనము లేక వృద్ధికి రాజాలక యుండెను. స్నేహితులవద్ద కొంత డబ్బును తెచ్చిపెడితిని గాని హేరాళముగ వ్యాపారమును చేయుటకు ఆ డబ్బు చాలదాయెను. ఇట్లుండగ మాతో కూడ వైద్యశాలలో పని చేయుచుండిన కె. బి. రంగనాధయ్యరు వారి అన్నగారి పేరుతో ధన్వంతరివైద్యశాల నొకదానిని స్థాపించిరి. అయితే వారి వద్దను డబ్బులేక కష్టపడుచుండిరి. అప్పుడు మద్రాసులో ఆయుర్వేదాశ్రమము, కేసరీకుటీరము, ధన్వంతరి వైద్యశాలయను పేర్లతో మూడు వైద్యశాల లుండెను గాని యెుకరి వద్దను డబ్బులేదు. అప్పుడు రంగనాధయ్యరు నా వద్దకు వచ్చి మన యిరువురము కలసి మందుల వ్యాపారమును చేయుదము ;

కావలసిన మూలధనమును నాకు తెలిసిన టి. ఆర్. రామచంద్రయ్యారు (సుప్రసిద్ధ హైకోర్టు వకీలు) గారి ద్వారా చెప్పించెదనని చెప్పి నన్ను నప్పించెను. అప్పుడు కేసరికుటీరముతో ధన్వంతరి వైద్యశాలను యేకముచేసి కేసిరికుటీరం అను పేరుతోనే మందుల వ్యాపారమును చేయ ప్రారంభించితిమి. కొంతకాలము జరిగెను. చెప్పిన ప్రకారము రంగ నాధయ్యరుగారు రామచంద్రయ్యగారి వద్దనుంచి డబ్బును తేలేకపోయిరి. వ్యాపారము నిద్రపోవుచుండెను. ఇరువురము భుక్తికి కూడా కష్టపడవలసి వచ్చెను.

అప్పుడు వారిని నేను విడిచిపెట్టి వేరుగ నా కేసరీకుటీరం పేరుతోనే వ్యాపారము ప్రారంభించితిని. క్రమముగ నా వ్యాపారము బాగుపడెను. నేను వృద్ధికివచ్చుట చూచి రంగనాధయ్యరుకు కన్నెఱ్ఱనాయెను. నామీద క్రిమినల్, సివిలు కేసులను తెచ్చి నన్ను చాలా కష్టనష్టములకు పాలుచేసిరి. తెచ్చిన కేసులు వారికి లాభించలేదు. కడపట Trade Mark Suit వారికి నాకు హైకోర్టులో జరిగెను. ఈ కేసులో జడ్జిగారి సలహా మీద వారు, నేను సమాధానపడితిమి ; వారికి నేను కొంత డబ్బు యిచ్చి నా మందులకు, వ్యాపారమునకు వారికి యేలాటి సంబంధము లేకుండ హైకోర్టుడిక్రీని పొందితిని. ఈ కష్టములకన్నిటికి కారణం యిరువురికి విభాగపత్రము లేకుండుటయే.

## స్త్రీ ధనమే నా మూలధనము

ఈ నా వ్యాపారమునకు స్త్రీ ధనమే మూలధనమని చెప్పుకొనుటకు చాల గర్వపడుచున్నాను. సుమారు అర్ధశతాబ్దమునకు మునుపు మన దేశములో అనుకూల దాంపత్య కుటుంబములు చాల తక్కువగనుండెను. భర్త భార్యను కొట్టుటయో, తిట్టుటయో, ఇంటినుండి తరిమి వేయుటయో, సామాన్యముగ జరుగుచుండినవి. మగని బాధలను భార్య భరించజాలక నూతిలో పడుటయు, విషము త్రాగుటయు, కిరసన్ నూనెతో కాలిపోవుటయు మొదలగు అమానుష కృత్యములు పలుమారు జరుగుచుండుట వినుచుంటిని. ఈ కారణములవల్ల ఆకాలపు గృహలక్ష్మికి మనశ్శాంతిలేక కాలమును కడు కష్టముతో గడుపుచుండెను. ఈ సందర్భమును నేనప్పుడు అవకాశముగ తీసుకొని స్త్రీలను బాగుపరచి తద్వారా నేనును బాగుపడవలయుననే సదుద్దేశముతో ఒక చిన్న పన్నాగమును పన్నితిని.

అప్పుడు నేనొక అడ్వర్టైయిజుమెంటును (ప్రకటనను) తయారుచేసుకొని ఆకాలమున సుప్రసిద్ధ తెలుగుపత్రికయగు 'ఆంధ్రప్రకాశిక' కార్యాలయమునకు వెళ్లితిని. ఈ కార్యాలయము అప్పుడు మౌంటురోడ్డులో యొక మిద్దెమీద యుండెను. ఈ పత్రికాధిపతియగు ఎ. సి. పార్థసారధి నాయుడిగారిని చూచితిని. నేను వారిని దర్శించుటకు వెళ్ళినప్పుడు వారు పాత వార్తాపత్రికలను చింపి, వాటి కాళీస్తళమున పెన్సలుతో వ్యాసములు వ్రాయుచుండిరి. నేను వారిని చూచి నమస్కరించితిని. చిఱునవ్వుతో నన్ను చూచి కూర్చుండుమనిరి. వచ్చిన కారణమును విచారించిరి. నా జేబులోనున్న అడ్వర్టయిజుమెంటును వారి చేతికిచ్చి పత్రికలో ప్రచురించుమని అడిగితిని. నేనిచ్చిన కాగితమును రెండుమూడుసార్లు ఇటూఅటూ పారచూచి నన్నుచూచి ఫక్కునవ్వి ఇది వేయుటకు తడవకు రు. 10 లు చార్జి అగునని చెప్పిరి. అంత యిప్పుడు ఇచ్చుకోలేనని చెప్పి నావద్దయున్న అయిదురూపాయిల నోటునుతీసి, వారి చేతిలోపెట్టితిని. అప్పుడు వారు నన్నుచూచి, నీవు చాల గడుసువాడవుగ నున్నావనిచెప్పి, మరియొకసారి నవ్వి నన్ను పంపివేసిరి.

ఆ కాలమున మద్రాసులో నాయుడుగారు ఆంధ్రులలో ప్రముఖులుగ నుండిరి. ఆంధ్రమున గంభీరమగు ఉపన్యాసముల నిచ్చుచుండిరి. చెన్నపురిలో ఆకాలమున నాయుడుగారు మాట్లాడని సభ ఉండెడిదికాదు. వీరు మొదట ఆంధ్రమున ఉపన్యాసమును ప్రారంభించి అరవములో ముగింతురు. సభలో మహుమ్మదీయులు మళయాళీలుండిన వారిభాషలలో మాట్లాడి అందరిని నవ్వించుచుండిరి. వీరు బక్కపల్చగ నుందురు. అంటిఅంటని తిరుమణి శ్రీచూర్ణమును ముఖమున దిద్దువారు; నవ్వుముఖము, తెల్లని తలపాగా, లాంగుకోటును ధరించువారు. సరసులు. తెలుగు పండితులు; చక్కని వాగ్ధోరణి గలవారు. ఆరోజులలో వీరు గొప్ప కాంగ్రెసువాదులు. ఆనాడు జరిగిన ఈ సన్నివేశమంతయు ఈనాడు నాకంటికి కనుపడుచున్నట్లే యున్నది.

నేను ఆనాడు పత్రికలో ప్రచురించుటకు వారివద్ద యిచ్చిన అడ్వర్టైయిజుమెంటు యేమనగా :—

మందగమన - సుందరాంగి అను ఇరువురు చెలికత్తెల సంభాషణ

(స్థళము : వీలాటి రేవుగట్టున బోర్లించిన బిందెలమీద ఇరువురు కూర్చుండి చేసిన సంభాషణ)

మందగమన :—ఏమే, సుందరీ! ఈమధ్య నీవు నాకు అగుపడుటయే లేదేమే?

సుందరాంగి :—ఏమి చెప్పుదునే అక్కయ్యా నా అవస్త ? నామగడు నన్ను చూచినప్పు డెల్లను కారాలు మిరియాలు నూరుతుంటారు. చీటికి మాటికి వీపు బద్దలయ్యేటట్లుగా బాదుతారు. నాతో మాట్లాడరు. ఇంట పరుండరు. ఈ నా అవస్థలో నిన్ను నేను యెట్లు చూడగల్గుదును ?

మందగమన :— ఓసీ పిచ్చిచెల్లీ ! ఈ మాత్రమునకేనా నీవు వ్యసపడడము ? నీకంటె పదిరెట్లు హెచ్చుగ కష్టముల ననుభవించినదానను. ఇవిగో చూడు నావేతి మీద వాతలు ; వీపుమీది కొరడాదెబ్బల మచ్చలు. అయితే ఇప్పుడు నేను, నాభర్త యొకరినొకరు క్షణమాత్రమైనను విడువజాలనంత అనురాగమున సుఖముగ నున్నాము. ఇందుకు కారణము మాప్రక్కయింటి సరస్వతియే. అమె యెప్పుడును ఆంధ్ర ప్రకాశిక పత్రికను చదువుచుండును. ఆమె నాకు చెప్పిన రహస్యము వల్లనే ఇప్పటి మా యిరువురి స్నేహము ; దానిఫలమే ఈ చిట్టికూతురు వాసంతిక.

సుందరాంగి :—అక్కయ్యా ! నీకు నమస్కరించెదను. ఆ రహస్యమును నాకును చెప్పి పుణ్యమును కట్టుకొనవే.

మందగమన : – చెప్పెదను వినుము సుందరీ. మద్రాసులో 'కేసరీ కుటీర' మను యొక వైద్యశాలకలదు. ఆ వైద్యశాలలో 'తాంబూలరంజిని' అను పడకటింటి తాంబూలములో వేసుకొను పరిమళ మాత్రలను విక్రయించెదరు. ఆ మాత్రల వెల బుడ్డీ 1 - కి నాలుగు అణాలు మాత్రమే. వాటిని నీవు కూడ తెప్పించుకొని నీభర్తకిచ్చు తాంబూలమున నుంచి యిచ్చిన, వారము దినములకే నీభర్త నీస్వాధీనమై నీకు దాసానుదాసుడగును. గనుకనీవు వెంటనే ఇంటికిపోయి కేసరీకుటీరమునకు కార్డును పంపుము.

సుందరాంగి వెంటనేయింటికి వెళ్లి మద్రాసు కేసరికుటీరమునకు తాంబూలరంజనీ మాత్రలను పంపమని ఆర్డరు పంపెను. మూడవదినమున మాత్రల పార్శిలు వచ్చెను. వచ్చిన ఆ రాత్రియే మాత్రలను భర్తకిచ్చెను. మరుసటి దినము మొదలు భర్తలో మార్పుగలిగి క్రమముగ అనుకూల దాంపత్య సుఖమనుభవించుచు త్వరలోనే సుందరాంగి సుముఖిని గనెను.

ఇదియే నా ప్రకటన.

ఆ కాలమున వార్తాపత్రికలలో ఔషధముల ప్రకటనలు చాల తక్కువగ నుండెను. ఈ ప్రకటనను చదివినవారందరు మాత్రలకు ఆర్డర్లు పంపుచుండిరి. ఈ పడకటింటి మందును రుచి చూడవలయుననే కోరికతో పురుషులుకూడ తెప్పించుకొనుచుండిరి. తమాషాకుకూడ కొందరు తెప్పించి వాడుకొను చుండిరి. కొందరు పురుషులు తమ పెంకె భార్యలకు కూడ యిచ్చుచుండిరి. ఈవిధముగ ఈ మాత్రలకు గిరాకియేర్పడి క్రమముగ సప్లయిచేయుటకు కూడ సాధ్యముకాకయుండెను. దినమునకు సుమారు నూరురూపాయల మాత్రలను విక్రయించుచుంటిని. ఈ చిన్న సన్నివేశమే నా జీవయాత్రను దారిద్ర్యారణ్యము నుండి ధనార్జనా సమర్థునిచేయు రాజమార్గమునకు చేర్చినది. నాటి నుండియే నా జీవితమార్గము సుఖసౌకర్యములకు మలుపుతిరిగినది. ఈవిధముగ నాకు ప్రోత్సాహము కలిగించిన ఈ స్త్రీధనముతో వైద్యశాలను వృద్ధిపరచి ఇతర మందులను తయారుచేయగలిగితిని.

1900 సంవత్సరమున మద్రాసు జార్జిటవున్ నారాయణమొదలివీధిలో యొక చిన్న బాడుగ ఇంటియందు కేసరికుటీరమును మొట్టమొదట స్థాపించితిని. ఆయిల్లు చిన్నదగుటవలన ఇంటికి కుటీరమని పేరు పెట్టి ఆ కుటీరమునకు నా పేరు జోడించి వైద్యశాలకు 'కేసరికుటీరం' అను నామధేయముతో వైద్య సంస్థను స్థాపించితిని. ఇంటిముందు వసారాగోడపైన 'కేసరికుటీరం - ఆయుర్వేద ఔషధశాల' యని బొగ్గుతో పేరు వ్రాసివుంచితిని. ఆ కాలమున నారాయణమొదలివీధిలో చాలమంది వైశ్యులు కాపురముండుచుండిరి.

నేనుండిన యిల్లు వీధిమధ్య నుండుటవలన వచ్చువారికి, పోవువారికి తెల్లగోడ మీద వ్రాసిన బొగ్గు అక్షరములు పిలిచినట్లు కనుబడుచుండుటవలన అందరు చదువుకొనుచు పోవుచుండిరి. ఈపేరు కొంతకాలమునకు అందరి నోటబడి క్రమముగ చిన్నవైద్యశాలగ మారినది. నేను కొంతకాలము ఆ వీధిలోనేయుండిన కన్యకాపరమేశ్వరీ వైద్యశాలలో కొలువు చేసియుండుటవలనను, చాలమంది వైశ్యులు నాకు తెలిసినవారగుటవలనను వారందరు నావద్దకు మందులకు వచ్చుచుండిరి. సాధారణముగ వైశ్యులలో చిన్నతనముననే వివాహమాడు ఆచారముండుట వలన చాలామంది విద్యార్థులుగ నుండినప్పుడే గృహస్థులుగనుండుట సంభవించుచుండెను. వీరిలో కొందరు వయసువచ్చీరానివారుండిరి. వీరలలో విద్య అలవడుటకు, పుష్టిగానుండుటకు మందులు కావలసిన పలువురు నన్నాశ్రయించుచుండిరి. వీరలకు నేను తియ్యటి లేహ్యములను, కమ్మటి షరబత్తులను చేసి యిచ్చుచుంటిని. ఇందువలన నా వైద్యవృత్తికి చాల లాభమగుచుండెను.

ఇప్పుడుండిన యిల్లు చాలా చిన్నదగుటవలనను, పలువురువచ్చిన కూర్చుండుటకు తగిన వసతి లేనందునను మరియొక యిల్లును ఆదియప్పన్ నాయునివీధిలో పెద్దయిల్లుగా చూచి వైద్యశాలను అక్కడికి మార్చితిని. ఈ యింటికి వచ్చినపిమ్మట మందులను బయట వూర్లకుకూడ పంపుటకు ప్రయత్నించి కొన్ని కరపత్రములను అచ్చువేయించితిని. ఒక గుమాస్తాను వక బోయవానిని సహాయముగ కుదుర్చుకుంటిని. అచ్చువేసిన కరపత్రములను స్వయముగ సాయం సమయమున మద్రాసులో అక్కడక్కడయున్న ఆఫీసుల వద్ద నిలుచుకొని ఉద్యోగస్థులకు పంచిపెట్టుచుంటిని. వీలుచూచుకొని ఆఫీసు లలోకి పోయి కొందరి ఆఫీసర్లకు మందులమ్ముచుంటిని. చిన్నక్యాటలాగులను అచ్చువేయించి వాటినిగూడ తీసుకొని రైలుప్రయాణములను చేయుచు పెద్ద వూర్లలో దిగి రెండుమూడు దినములు అక్కడవుండి షాపులవార్లవద్దకువెళ్లి మందుల ఆర్డర్లు తీసుకొనుచుంటిరి. నేను కేసరికుటీరం యేజంటునని వార్లకు చెప్పుచుంటిని. వారలకు నా పేరు కె. నరసింహం అని చెప్పి, వార్లకు నా విజి టింగుకార్డును యిచ్చుచుంటిని. ఆ కాలమున ఈలాంటి వైద్యశాలలు తక్కు వగుటవలన ఆర్డర్లు మెండుగ చిక్కుచుండినవి.

ఈ ప్రకారము వైద్యశాలను స్థాపించిన ప్రారంభదశలో అన్ని కార్యము లను నేను స్వంతముగనే చూచుకొనుచు వైద్యశాలను దినదినాభివృద్ధి చేయు చుండుటవలన వైద్యశాలకు స్థళము అధికముగ కావలసివచ్చి వకచోటు నుండి మరియొక చోటికి అప్పుడప్పుడు మారవలసివచ్చుచుండెను. ఆదియప్పనాయుని వీధినుండి మలయపెరుమాళ్ల వీధికి, పిమ్మట గోవిందప్పనాయుని వీధికి, అటుపిమ్మట బందరువీధికి మారితిని. ఈ ప్రకారము బాడుగయిండ్ల బాధను అనుభవించుచూ స్వంతగృహమునకు ప్రయత్నించి ఎగ్మూరులో యొకయింటిని వేలములోకొని ఆ పాత యింటిని పడగొట్టి క్రొత్తగ అన్నివసతులకు సరిపోవు నటుల ఒక గృహము నా కాపురముండుటకు, రెండవదానిలో ఆఫీసు అచ్చు కూటముల నుంచుటకు, రెండు భవనములను కట్టించితిని.

ఈ స్వగృహములు రెండు పూర్తికాగానే బందరువీధి నుండి ఆఫీసును యిక్కడికి మార్చితిని.

# 6 నా మొదటి పెండ్లి

నేను మద్రాసులో జీవనోపాయమును సంపాదించుకొన్నందున నా మేనమామగారు నాకు పిల్లనిచ్చి పెండ్లి చేసెదనని జాబునువ్రాసిరి. (ఇంకా వుంది






## 1989 మే 25

పరిపూర్ణమైన ఆరోగ్యంతో తొంభయి సంవత్సరాలు (1899 - 1989) గడిపిన శ్రీ ఆర్ వివి యస్ ప్రసాద్ (అమరావతీ జమీందార్ - బిఎ బియల్) నిన్న సాయింత్రం నాలుగు గంటలకి కాలధర్మం చెందారు. రెండు మూడు శుభకార్యాలలో చూసినప్పటికీ వారితో వ్యక్తిగతంగా పరిచయం లేదు - మిత్రులు మురళిగారి తండ్రి అని మాత్రమే తెలుసు. కుమార్తెలలో ఒక్క మిసెస్ శంభు ప్రసాద్ (ప్రభావతి) తప్ప మిగతా కొడుకులూ కూతుళ్లూ దగ్గిరుండగా అయన కన్ను మూశారు. జాతస్యఃమరణమ్ ధృవమ్ అని తెలిసినప్పటికీ, మగ్గిన పండు రాలిపోక తప్పదని తెలిసినప్పటికీ ఒక నిండు ప్రాణి తెర వెనక్కి తప్పుకోగానే శూన్యత, విషాదమూ ఆవరిస్తాయి.... ఈ ఉదయం వీనస్ కాలనీలోని వారి యింటినుంచి, ఆయన కడపటి ప్రయాణం.... ప్రేమ్‌చంద్ దంపతులకు, మాకు మురళీగారే (ఆయన రెండవ కుమారుడు) బాగా పరిచయం. పదిన్నర దాకా వుండి కర్మకాండ అంతా పూర్తి అయి, అయన కాలాగ్ని వైపుగా మళ్లాక, నలుగురం యింటి కొచ్చాం.... మురళీగారికి, ఆయన సోదరులకు, సోదరీమణులకు, బంధువర్గానికి మా హృదయ పూర్వక సానుభూతి.... 'దేహినో అస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా - తథా దేహాంతర ప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి' (గీత : 2 - 13)

## ..... 29

ఆంధ్రప్రదేశ్ సమాచార సాంస్కృతిక మంత్రి వివేకానంద, పొట్టి శ్రీరాములు బిల్డింగ్‌కి విచ్చేశారు. జీర్ణావస్థలో వున్న ఈ మెమోరియల్ బిల్డింగ్ పునర్నిర్మాణానికై కమిటీవారు పంపుకున్న విన్నపమూ ప్లానూ అన్నీ యించుమించు అమోదం పొందినట్లే! అయితే భవన నిర్మాణానికయే ఏడెనిమిది లక్షల గ్రాంటు యింకా మంజూరు కాలేదు. అది మంజూరైన తర్వాత కూడా, భవన నిర్మాణం గావించవలసినది అప్రువుడ్ ప్లాన్ ప్రకారం ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ పబ్లిక్ వర్క్స్‌శాఖే! 1986 మే నెల 11వ తేదీన ఆంధ్ర ముఖ్యమంత్రి యన్ టి

రామరావు, ఈ స్మారక మందిరానికి వచ్చి యిక్కడి పరిస్థితులన్నీ స్వయంగా చూసి వున్నారు - ఆ తర్వాత ఛీఫ్ అర్కి టెక్ట్, ఛీఫ్ ఇంజనీరు మున్నగు ఉన్నతాధికారులు రావడం, తమ ఆమోదం తెలపడంతో, మొత్తం కాగితాలన్నీ రాష్ట్రప్రభుత్వ సాంస్కృతిక శాఖలో ఉన్నాయి. అదే విషయం తమ విజ్ఞాపనలో తెలిపారు సెక్రటరీ శాస్త్రిగారు మంత్రివర్యునికి. 'యువకులూ కార్యదక్షులూ అయిన వివేకానంద, ఈ సత్కార్యం చేయగలరని విశ్వసిస్తున్నాను' - అన్నారు కమిటీ అధ్యక్షులు శాంతప్ప! "ఈ భవన నిర్మాణ భారం మీద, మాదా అని కాదు, - మనది. నాచేతనైనంత తప్ప కుండా చేస్తాను" - అని మాట ఇచ్చారు విద్యాధికులు వినమ్రతాశీలురు అయిన వివేకానంద.

## 30

ముప్పయి నాలుగేళ్ల 'బృందాకాళి'ని చూసినప్పుడు, ఆమె తను దక్షిణాఫ్రికా నుంచి వచ్చానని చెబితే తప్ప, ఇక్కడ ఈ మద్రాసులోని మనిషే అనుకుంటాం, నిగర్వి, నిండైన విగ్రహం, నిర్మలమైన నేత్రాలు, ఆకర్షణీయమగు రూపలావణ్యం, ఆధునికతను భారతీయతను సమ్మిశ్రిత పరిచే సాంస్కృతిక దృష్టి, సాహిత్య పిపాస, 129 సంవత్సరాల క్రితం ఈ భరతభూమి నుంచి తన పూర్వీకులు అక్కడికివెళ్లి స్థిరపడ్డా, తన 'రూట్స్' తెలుసుకోవాలనే తపన అక్కడి ఇండియన్ కమ్యూనిటీకి ఈ ప్రాచీన వారసత్వంలోని శాశ్వత విలువలు తెలుపాలనే అభిలాష యివీ మరింకెన్నో కలపగా వెరసి 'బృందాకాళి'. భారతప్రభుత్వానికీ దక్షిణాఫ్రికా ప్రభుత్వానికీ దౌత్యపరమగు సంబంధ బాంధవ్యాలు లేవు. అయితే, సాంస్కృతిక విషయాలలో కొంచెం పట్టు విడుపులు వున్నాయి. అందువల్లనే ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్ (Indian Council for Cultural Relations) వారి ఆహ్వానంపై ఈమె భారతదేశంలో పర్యటించగలుగుతున్నారు - ఢిల్లీ, ఆగ్రా, జయపూర్ మున్నగు చోట్లకు వెళ్లారు - ఇక్కడనుంచి ఎల్లుండి నాగపూర్ వెళ్తున్నారు. 'బృందాకాళి' దక్షిణాఫ్రికాలోని ప్రఖ్యాత ఇండియన్ రచయిత్రి అవడంవల్ల, యిక్కడి సాహితీకారులని కలుసుకుంటున్నారు. కేంద్ర సాహిత్య అకాడమీ ప్రాంతీయ కార్యదర్శి కృష్ణమూర్తి, వారి ఆఫీసులో చిన్నసమావేశం ఏర్పాటుచేశారు - ఉపన్యాసాలులేని యిష్టాగోష్ఠి. ఏడెనిమిదేళ్ల క్రితం దక్షిణాఫ్రికా నుంచి వచ్చిన విద్యావేత్త నాయుడు, ఆయన తయారుచేయించిన తెలుగు తమిళ వాచకాలు, ఆడియో కాసెట్స్, అందులో మాప్రమేయం - యిలాంటివి సంభాషణలో రావడం సహజం .... బృందాకాళి జర్నలిస్టూ, టివి ప్రొడ్యూసరేగాక (దక్షిణాఫ్రికా టివిలో ఇండియన్ మాగజైన్ నిర్వాహకురాలు) నాలుగు పుస్తకాలు రాశారు. 'స్వామి సిన్స్' (Swamy Sins) అనే ఆమె

త్రైలేస్‌నవలని ఆంగ్లపాఠకులు ఎంతో ఆదరించారు - ఆమె వ్రాయడం ప్రపంచభాష అయిన ఇంగ్లీషులోనే! లెజెండ్స్ ఆఫ్ ఏన్షియంట్ ఇండియా (Legends of Ancient India) అనే పేరుతో ఆమె పిల్లలకోసం ఒక పుస్తక మాల రచిస్తున్నారు .... 'ఏదేశమేగినా ఎందు కాలిడినా పొగడరా నీ తల్లి భూమి భారతిని' అన్న రాయప్రోలు వారి స్వప్నానికి సజీవ నిదర్శనం బృందాకాళి.

. . . . . 31

మ్యూజిక్ అకాడమీలో మూవీ ఆర్టిస్ట్ హీరోకృష్ణ 47వ జన్మదినోత్సవం, సుమనోజ్ఞంగా జరిగింది. 'ఏహీరో అభిమానులైనా, రాజకీయాల్లో జంప్ చేయవచ్చునేమో గాని కృష్ణగారి అభిమానుల విషయంలో అటువంటిది లేదు' - అన్నారు దాసరి నారాయణ రావు, 'మీనా' నుంచి యిప్పటిదాకా ముప్ఫయ్యారు చిత్రాలు డైరక్ట్ చేసిన మహిళా దర్శకురాలు విజయనిర్మల, 'సూపర్ హీరో కృష్ణగారిలోని సాహసమే, సాహసమే ఊపిరి 'సాహసమే.... చిత్రం నాచేత తీయించింది' - అన్నారు, 'ఎవరికీ తలవంచని నేను, కృష్ణలోని మంచితనానికి తలవంచుతాను, తనొక వటవృక్షమై ఎందరికో ఆశ్రయమిస్తున్న సద్గుణ శీలి మా కృష్ణ, - అని చెప్పారు కార్యక్రమ ప్రయోక్త మహారధి. "మోసగాళ్లకు మోసగాడు"తో నాలోకదలిక కలిగింది; 'అల్లూరి

సీతారామరాజు' నన్ను ముందుకి పురికింపింది - కృష్ణగారు నా గురువు, నాకు మార్గదర్శి'' - అన్నారు 50వ చిత్రంలో నటిస్తున్న యంగ్ హీరో నరేష్. ఘనంగా పనులుచేస్తూ, క్లుప్తంగా మాట్లాడే అలవాటుగల కృష్ణ, తన 48వ జన్మదినం హైదరాబాదులో జరుగుతుందనీ, అప్పటికి ఆంధ్రాలో కాంగ్రెస్ పార్టీ తన సముచిత స్థానం పొందగలుగుతుందనీ ఆశాభావం వ్యక్తం చేస్తూ, కష్టపడి వచ్చిన తన అభిమానులకు కృతజ్ఞతలు వెలిబుచ్చారు. సుధాకర్ మిమిక్రీతో ప్రారంభమై, ఊకదంపు ఉపన్యాసాలు లేకుండా, హాయిగా గంటన్నరలో ముగిసింది. 'తమ కార్యంబు బరిత్యజించియుబరార్థ ప్రాపకుల్ సజ్జనుల్ ....' - అంటూ భర్తృహరి 'పరోపకార పద్ధతి' లోని పద్యం మహారథి చెప్పినదీ, సాహసికుడైన కృష్ణకు అన్ని విధాలా అన్వయిస్తుందనడంలో సందేహంలేదు .... మెనీమెనీ హాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే.

## 1989 జూన్ 01

ప్రఖ్యాత నాట్యకళాకారిణి రాజసులోచన, ప్రముఖ చలనచిత్ర దర్శకులు సియస్ రావు, తమ కుమార్తె సౌ॥ శ్రీకి, చి॥ శ్రీనివాసన్‌కి ఈ ఉదయం 9 గం॥ 21 ని॥లకు, వుడ్ లాండ్స్ కళ్యాణవేదికలో శాస్త్రోక్తంగా వివాహం జరిపించారు. సాయంత్రం రిసెప్షన్‌లో గంగై అమరన్ పార్టీవారి సంగీతలహరి. పొద్దుటా, సాయంత్రం ఫిలిమ్ పరిశ్రమలోను యితర రంగాలలోను గల ప్రముఖులనేకులు విచ్చేసి నూతన దంపతులకు తమ శుభాభినందనలు తెలిపారు. వరుడు శ్రీనివాసన్ షికాగోలోని బెల్ లాబ్స్‌లో సాఫ్ట్‌వేర్ ఇంజనీరు.

## ..... 10

ఆంధ్ర విశ్వవిద్యాలయ మాజీ ఉపాధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ మాజీమంత్రి, ప్రస్తుతం తెలుగు అకాడమీ అకడమిక్ కౌన్సిల్ అధ్యక్షులు అయిన యమ్మార్ అప్పారావు, పొట్టి శ్రీరాములు హాలుకి ఈ సాయంత్రం విచ్చేసి, స్మారక మందిరం గ్రంధాలయం యిత్యాదులు స్వయంగా చూశారు. పొట్టి శ్రీరాములు దివంగతులైననాడు, అప్పారావుగారు యిక్కడే ఉన్నారట – శ్రీరాములు భౌతిక కాయాన్ని మేడమీద నుంచి కిందకు చేర్చినవారిలో ఆయన కూడా ఒకరు - ముప్ఫయయిదేళ్లనాటి మాట అది.... పోయిన ఆదివారం ఉదయం (జూన్ - 4) అప్పారావుగారు మా యింటికొచ్చారు మా యిద్దరినీ చూడటానికి ! అంతకు పదిరోజుల క్రితమొకసారి (మే - 25) సతీసమేతంగా వచ్చినప్పుడు, ఇద్దరమూ యింట్లోలేము. బెంగుళూరు వెళుతున్నామనీ, రిటర్నిజర్నీలో మళ్లీ వస్తామనీ మా శారదాంబతో చెప్పారట. అన్నట్టుగానే ఆయన రావటం మాకెంతో సంతోషాన్ని కలిగించింది. 'జగతి' ప్రమదావనం, సాహిత్య బాంధవ్యం, చిర

కాలపరిచయం - యివేగాక అప్పారావు గారిది నూజివీడు (ఇప్పుడు జమీందారీలు లేకపోయినా, వుయ్యూరు రాజుగారి పెద్ద కుమారుడు) ; మాలతి పుట్టినదీ, పన్నెండేళ్లొచ్చేదాకా పెరిగినదీ నూజివీడులోనే ! అంచేత, 'మా వూరు' (జన్మభూమిశ్చ) అనే అభిమానం కొంత లేకపోలేదు .... ప్రపంచ వార్తలు కాసేపయాక, మద్రాసులోని తెలుగు సంస్థలు, తెలుగు భాషాభివృద్ధి గురించిన ప్రస్తావన వచ్చింది. తత్ఫలితమే ఈనాటి సమావేశం .... 'ఉదయం ఏర్‌కండీషన్డ్ రూములో కూచుని గంటసేపు ధ్యానం చేసే నాప్రార్థన గొప్పదా, మధ్యాహ్నం మండుటెండలో గంటసేపు నిలబడి బట్టలు వుతికే రజకుని వృత్తి ధర్మం గొప్పదా?'' - అని ప్రశ్నించగల కవితాహృదయం అప్పారావుగారిది .... పొట్టి శ్రీరాములు సొసైటీ సెక్రటరీ శాస్త్రిగారి స్వాగత వచనమయాక, 'ఇక్కడ తెలుగు భాషాభివృద్ధికి ఏంచేస్తే బావుంటుందో మీరే సూచించండి' అన్నారు అప్పారావు, - తమ ప్రసంగమయాక ! .... మద్రాసు విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధిపతి కృష్ణమూర్తి పిహెచ్‌డి చేస్తున్న విద్యార్థుల ఉపకార వేతనాలు పెంచాలన్నారు. క్వీన్ మేరీస్ తెలుగు శాఖాధిపతి లలిత' కాలేజీలోని విద్యార్థినులకు సముచితరీతిని స్కాలర్‌షిప్స్ అందుతున్నాయని చెప్పారు. కులమత విచక్షణ లేకుండా, అయా విద్యాసంస్థల సిఫారసుతో అర్హులైన

వారికిచ్చే స్కాలర్‌షిప్పూ, లలిత కళలు, సారస్వతం, ధార్మిక విషయాలకు చెందిన పుస్తకాల ప్రచురణకు ఆర్థిక సహాయమూ స్వధర్మస్వారాజ్య సంఘ్ ఏవిధంగా చేస్తున్నదీ తెలిపారు బివియస్సెస్ మణి. భాషాప్రయుక్త రాష్ట్రాలంటూ ఏర్పడ్డాక, ప్రతిభాషా ప్రాంతంలోను మైనారిటీ భాషలంటూ వుంటాయనీ, వాటి రక్షణ, అభివృద్ధి ప్రభుత్వస్థాయిలో జరగాలనీ, ఈ భాషారాష్ట్రాలు దేశమంతటికీ, తమకీ కేంద్రానికీ 'లింక్ లాంగ్వేజి' అయిన ఇంగ్లీషు మీద దండెత్తడం తప్ప, నిర్మాణాత్మకంగా ఏమీ చేయడం లేదనీ విచారం వ్యక్తపరిచారు డి ఆంజనేయులు. 'తమిళనాడులో తెలుగుని ఉద్ధరిద్దామనుకొనేముందు, ఆంధ్రప్రదేశ్‌లో మైనారిటీ భాషలైన కన్నడ, తమిళ, మరాఠీలకు తామేమి చేస్తున్నదీ రాష్ట్రప్రభుత్వం ఆత్మవిమర్శ చేసుకోవలసివుంది - ఎంతకీ వుర్దు గురించి మాట్లాడుతారే తప్ప, హైదరాబాదులో మిగతా వాటిగురించి పట్టించుకుంటున్నారా? భాషాభివృద్ధి, సామాన్య పాఠశాలలనుంచి కళాశాలల దాకాను, ప్రజానీకంలోను, రాష్ట్రప్రభుత్వాల విద్యాశాఖల పరస్పర సంప్రదింపుల ద్వారా జరగవలసి వుంది' - అన్నారు సూటిగాను, నిర్మొగమాటంగాను మల్లిక్, 'మంత్రుల పుణ్యకాలమంతా తమ కుర్చీలు కాపాడుకోవడంలోనే గడచిపోతోంది; రాజకీయ ప్రభంజనాలకు లోనుగాక స్థిరంగా వుండే ఉన్నతాధికారులే కొంతలో కొంత మంచి చేయగలుగుతారు; ఈ భవన పునర్నిర్మాణానికి యిస్తామన్న ఆ ఏడెనిమిది లక్షలు యిప్పించగలిగితే, అదే మాకు మహోపకారం' - అన్నారు డివి నరసరాజు. "'ఆంధ్రా' ఏర్పడ్డాక మంచివాళ్లందరూ మద్రాసులో మిగిలిపోయారని నేను వెనకొకసారి తమాషాగా అన్నందుకు తప్పుబట్టారు. రాజాలక్ష్మీ అవార్డు, (పాతికవేలు), యల్విపి రామయ్య అవార్డ్ (ముప్ఫయివేలు), యార్లగడ్డ వెంకన్న చౌదరీ అవార్డ్ (ఒక లక్ష - ఒకరు లేక యిద్దరికి) - యిటువంటివి ఒక్కటి వినిపించవేమిటి అక్కడనుంచి?" - అంటూ బియస్సార్ వందన సమర్పణ గావించారు. గంటన్నరా యిట్టే గడిచిపోయినట్టుంది.

. . . . . 15

"శ్రీ శ్రీ వర్ధంతి సభలకు లోగడ రెండు మూడు తడవలు నన్ను పిలిచారు. కాని, ఆయన నాకు మరీ దగ్గిర అవటం వల్ల నిరాకరించాను - ఈసారి తప్పలేదు. 1946 నుంచి శ్రీ శ్రీ, నేనూ ఎంత సన్నిహితులమో, ఎదురుగా కూచున్న చంద్రూర్‌గారికి తెలుసు. మర్నాడు ఎలా గడుస్తుందో తెలియని రోజులలో పక్కవీధిలోని కె మహాదేవన్ బుక్‌షాపుకి వచ్చి జేబులు ఖాళీచేసుకు వెళ్లేవాళ్లం. ఇద్దరమూ జంటగా ఎన్నో చిత్రాలకు పాటలు రాశాము - ఆరోజుల్లో శ్రీ శ్రీయా ఆరుద్రా అనే ప్రశ్నలేదు - ఇద్దరి కంఠమూ ఒకటే! అయితే, కాల

క్రమేణా మాకు సిద్ధాంత పరంగా అభిప్రాయ భేదం వచ్చింది; 1958 నుంచీ దారులు వేరయినాయి. ఫిలిమ్ మీడియమ్‌లోని సాంకేతిక సాధక బాధకాలు తెలుసుకునేందుకు నేను అనేకచోట్ల అసిస్టెంట్‌గా పని చేశాను; సన్నివేశానికి అనుకూలమైన పాట తన బాణీలో వ్రాసి, డబ్బులు పుచ్చుకు చేతులు కడుక్కోవడమే శ్రీ శ్రీ పద్ధతి. తామరాకు మీద నీటి బొట్టులా వుండేవాడాయన సినిమా ప్రపంచం విషయంలో! ఒక రోజున పది పాటలు రాశాడు - అది రికార్డ్ కావచ్చు .... పదినిముషాలలో పాటరాసి యివ్వగా, 'పట్టున పది నిమిషాలు కూడా పట్టలేదు - ఈ కాస్త దానికి యింత పేమెంటా?' అన్నాడొక ప్రొడ్యూసర్ ఒకసారి నాతో! నేను వెంటనే 'ఈ పది నిము షాల వెనక - పాతికేళ్ల అనుభవం ఉంది - మర్చిపోకండి' అన్నాను .... గూడవల్లి రామ బ్రహ్మంగారు బసవరాజు అప్పారావు 'నల్లవాడే గొల్ల పిల్లవాడే' వంటివి వెండితెర ద్వారా పరిచయం చేయడంతో ఆధు నిక చిత్రసీమలోని సినిమా పాటకు ఆద్యుడయాడు .... 'కవిగారు' కాల క్రమేణా 'మాటల పాటల రచయిత' అయాడు. ఆ తర్వాత మాటలు రాసేవారు వేరు. పాటలు సమ కూర్చేవారు ఇద్దరూ ముగ్గురూ అయారు .... మద్రాసు ఫిలిమ్ పరి శ్రమలో తెలుగు కవితారీతులు తమిళ కవితారీతులు ఒకదానితో ఒకటి పెన వేసుకు పోయాయి. జనరంజకత ప్రధానం; బాణీకి అనువైన పదాలు కూర్చడంలో ప్రాచీన వాగ్గేయకారుల నుంచి, జానపద సాహిత్యం నుంచి యథేచ్ఛగా తీసుకోనేవారు; ప్రజా దరణ పొందిన చాలా పాటలకు వెనకనొక మాతృక ఉన్నదనే విష యం జనావళి తెలియదు. మల్లాది రామకృష్ణశాస్త్రి వంటివారు సాహితీ సుధ పంచిపెట్టగా, కొసరాజువంటి వారు జానపదులలోని గుండెగానం వినిపించారు. పదకవితను పల్లకీ ఎక్కించింది సినిమా సాహిత్యం" - అన్నారు ఆరుద్ర, పొట్టిశ్రీరాములు హాలులో జరిగిన శ్రీ శ్రీ ఆరవ వర్ధంతి సభలో .... "సాహిత్యమూ, సంగీత బాణి, సన్నివేశ చిత్రణ ఈ మూడూ కలిసి సినిమా పాటకు ప్రాణం పోస్తు న్నాయి. ఇందులో ఏ ఒక్కటి సక్ర మంగా లేకపోయినా కుంటినడక అవుతుంది. ప్రారంభదశలో తెలుగు చిత్రాలలోని పాటలు నాటకీయ ఫక్కీలో నడిచేవి. నెమ్మదినెమ్మదిగా ఆ సంకెళ్లు విదుల్చుకు, తనదైన రూపు దిద్దుకోవడం ఆరంభించింది సినిమాగీతం. అధిక సంఖ్యాకులకి బోధపడే భాషలో ఉండాలి - దానికి చవకబారు తనం ఉండకూడదు; పండిత ప్రవర్గ పనికిరాదు. ఆ విధంగా కూర్పు పొందిన గీతిక, శ్రవణపేయ మనదగు 'సంగీతం' క్షేమములో ఇమడాలి. ఈ రెండూ చాలవు - దర్శకుడు చూపించే చిత్ర చయనికలో యిది సందర్భోచితమగు

సహజత్వ మనిపించాలి. అప్పుడు గాని ప్రేక్షకులు ఆ పాటని మెచ్చు కోరు. ఈ మూడూ కలిసొచ్చి, పిక్చర్ విజయవంతమైతే పాటలు హిట్స్ అవుతాయి .... సినిమాపాట లలో ద్వంద్వార్థాలూ, అశ్లీలమూ ఎక్కువవుతున్నాయనే అభియోగం ఒకటి ఉంది. గోదావరి పుష్కరాల గ్రామఫోను రికార్డులో అశ్లీలం లేదా? జానపదుల పాటల్లో అశ్లీలం లేదా? శివరావుచేత ఎన్ని అశ్లీలపు మాటలు పలికించలేదు? 'వల్గారిటీ' అనేది ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన ఉప్పెన. ఈనాడు ఏరంగంలో వల్గారిటీ లేదు గనక! సభ్యత, సంస్కారం గల వారెవరూ వల్గారిటీని, అశ్లీలతను సహించరు .... ఏభైఅయిదు, అర వైల దాకా ఉన్న సినిమా పాటల స్వరూపం వేరు - ఆ తర్వాత వాద్యాల సంఖ్య పెరగడంతో గీతికా స్వరూపం కూడా మారింది. జయదేవుని అష్టపదులూ అన్నమాచార్యుని పదకవితలూతో బాటు జావళీలు, జానపదగేయాలు తెలుగు సినిమా పాటలలో భిన్నరూపాన సాక్షాత్కరిస్తూంటాయి" - అన్నారు ప్రఖ్యాత

సంగీత విమర్శకులు వి.ఎ.కె. రంగారావు. శ్రీశ్రీ మెమోరియల్ ఇన్‌స్టిట్యూట్ తరఫున మల్లిక్ వందన సమర్పణ గావించారు! .... ఇంగ్లీషులో ఇరువురు స్పీకర్లు బాలా బాగా మాట్లాడారు గాని తయారు చేసుకొచ్చినవి కాకపోవడం వల్ల కాస్త రిపిటీషన్! ఆరుద్ర తన అధ్యక్షోపన్యాసం ఎంతో చక్కగా చెప్పారు - అయితే, 'కంక్లూడింగ్ రిమార్క్స్' ఉపన్యాసమంత టైము తీసుకున్నాయి. వి.ఎ.కె. రంగారావు, తన ప్రసంగం మొదట్లో సినిమాపాటకు వుండే లక్షణాలు విస్పష్టంగా వివరించారు. ఆ తర్వాత అసలు విషయాలకంటె (Lyrics in Films: Then and Now) వ్యక్తిగతానుభవాలకి ప్రాముఖ్యమిచ్చారు. ఏమయితేనేం, శ్రీ శ్రీని జ్ఞాపకం చేసుకుంటూ, రెండున్నర గంటల సద్గోష్ఠి - ఆసక్తికరమగు విషయాలు వినగల అవకాశం కల్పించిన కార్యకర్తలు (శ్రీశ్రీ మెమోరియల్ ఇన్‌స్టిట్యూట్) అభినందనీయులు.

. . . . . 17

1968 లో కథానాయికగా 'తులాభారం'లో ఊర్వశి అవార్డ్ వచ్చినప్పుడు, వుడ్‌లాండ్స్‌లో ప్రతికా సమావేశం జరిగింది. మిగతావారు ఆమె గురించి మాట్లాడారు - ఆమెని మాట్లాడమన్నప్పుడు, నుంచుని నమస్కారం చేయడం తప్ప రెండు ముక్కలు చెప్పలేకపోయిన వ్యక్తి, రెండేళ్ల తర్వాత అమెరికన్ సెంటరులో, వారి చలనచిత్రోత్సవ ఆవిష్కరణ సందర్భంగా ఇంగ్లీషులో అయిదారు నిముషాలు చెప్పిన 'స్పీచ్' (వ్రాసుకొచ్చినదే అయినప్పటికీ) విని, ఆశ్చర్యపోయాను. ఆనాడు అమెరికన్ సెంటరులో సమావేశమైన పాత్రిక ముప్పయి మందిలో నేనొక్కడినే తెలుగు జర్నలిస్టుని. ఆడిటోరియమ్ అండర్‌గ్రవుండ్‌లో ఉంటుంది. మెట్లెక్కి పైకి వస్తున్నప్పుడు, "కంగ్రాట్స్, శారదగారూ - వుర్ ఆర్ ప్రవుడ్ ఆఫ్ యు" అన్నాను- 'తప్పులు లేకుండా చెప్పానా?' అని అడిగారామె. "పెర్‌ఫెక్ట్ - బాలా చక్కటి ఉచ్చారణతో బావుంది" అన్నాను. తన ప్రయత్నం విజయవంతమయిందనే తృప్తి ఆమె వీరుహాసంలో కనిపించింది. ఆ తర్వాత ఆమె మహాలింగపురం, నేను మైలాపూరు.... కొన్ని జ్ఞాపకాలలా చెరక్కుండా ఉంటాయి. సాధనమున పనులు సమకూరు ధరలోన, ముదితల్ నేర్వగరాని విద్యగలదే - యిటువంటి పద్యపాదాలు ఎన్నయినా చెప్పుకోవచ్చు. శారద జీవితం ఒక సక్సెస్ స్టోరీ - ఆ సక్సెస్ ఐశ్వర్య రీత్యా కాదు - కళామయలోకంలో! ముఖ్యంగా వెండితెర ప్రపంచంలో!.... "గూడూరులో ఈ యువనటికి ప్రయిజ్ వచ్చింది. తరువాత విజయవాడ విజయమహల్‌లో ఒక ఆదివారం ఉదయం ప్రదర్శించిన నాటికలలో ఈ అమ్మాయిని మెచ్చుకున్నారు" ('నటన దీక్షాపరుడు డా॥

చంద్రశేఖరం' - పేజీ 176) .... ఆ యువనటే మూడుసార్లు ఊర్వశీ బిరుదాంకితురాలైన శారద. మొత్తం భారతదేశంలో మూడు తడవలు 'ఊర్వశి' గౌరవమందుకున్న నటి శారద ఒక్కరే! రంగస్థలం నుంచి, కామెడీ పాత్రల నుంచీ, 'ఇద్దరు మిత్రులు'లో (అన్నపూర్ణా 'మధుసూదనరావు' చిత్రం) కథానాయిక అయింది.... రాజ్యశ్రీ బిజీగా వుండి కేరళ వెళ్లలేకపోవటంవల్ల, మళయాళ సీమలోని 'ఇనప్రవుక్తై' ('ప్రేమ పక్షులు') భాస్సు, సత్యమ్, ప్రేమ్ నజీర్‌లతో నటించే మహదవకాశం యాదృచ్ఛికంగా తనకు లభించిందంటారామె. ఆ తర్వాత వాసుదేవన్ నాయర్ 'ఇనుత్తింటె ఆత్మావు' ('అంధకారంలోని ఆత్మ').... 'తులాభారం' నాలుగు భాషల్లోనూ శారదే హీరోయిన్. రెండవ ఊర్వశి అవా 1972 నాటి 'స్వయంవరాని'కి మూడోది 1979 'నిమజ్జనం'.... 118 మళయాళంలో, 16 తమిళంలో, 4 హిందీలో, 4 కన్నడంలో, స్టేట్‌రౌడీ, రక్తకన్నీరులతో కలిపి 125 తెలుగులో! ఇదీ ఆమె పిక్చర్ స్కోర్.... కిన్నెర ఆర్ట్ థియేటర్స్‌వారు ఊర్వశి శారదకు హైదరాబాదులోని సంగమ్ థియేటర్ లో 1989 జూన్ 25 వ తేదీన అభినందనోత్సవం జరుపుతున్నారు. ఆ సందర్భంగా పత్రికాసోదరులను ఈ ఉదయం తమ యింటికి బ్రేక్‌ఫాస్ట్‌కి ఆహ్వానించి యిన్నేళ్లుగా పత్రికలవారు తన విషయంలో చూబుతున్న ఆదరణకు, ఇస్తున్న ప్రోత్సాహానికీ కృతజ్ఞత వెలిబుచ్చుతూ, నటీనటులు తమ ఇమేజ్ పరిపోషణకు అనువైన పాత్రలు ధరించక తప్పడం లేదన్నారు శారద. .... రాణీ రుద్రమదేవి పాత్రలో మిమ్మల్ని చూడాలని మా అభిలాష అన్నారు కాగడా శర్మ .... (పి ఆర్ ఒ: జగన్మోహన్) .... అయిదున్నరకి సురేష్ మహల్‌లో, అశోక్‌కుమార్ నిర్మాతగా, వై నాగేశ్వరరావు దర్శకునిగా, ఉషాఆర్ట్‌వారి 'ధ్రువ నక్షత్రం' పాటలప్రదర్శన. వెంకటేష్, రజని హీరో హీరోయినులు. ఊర్వశి శారద, భానూచందర్, సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, రాళ్లపల్లి చలపతిరావు మున్నగువారున్నారు. ..ఎచూరి బ్రదర్స్ కథ! వేటూరి, ఆత్రేయల పాటలు; చక్రవర్తి సంగీతం. మొత్తం పిక్చర్ 90 రోజులలో పూర్తి చేశారు; ఒకొక్కపాట పిక్చరైజ్ చేయడానికి అయిదారు రోజులు పట్టిందట ....'కసిగా ఓ కౌగిలి ఇస్తా కాదనకయ్యో' అంటుంది హీరోయిన్, హీరో గారిని చుట్టేసుకుంటూ! ఆధునిక ప్రణయ కావ్యాలలో అమ్మాయిల లవ్ కట్టలు తెగి ప్రవహించగా అబ్బాయిలు శీల సంరక్షణార్థమైన తికమకలు పడుతూంటారు. సరసమే తప్పు సంసారం వొద్దనుకొనే ఈ హీరోని పూలబాణాలను మించిన కవ్వింపు చర్యలతో పడగొట్టే హీరోయిన్, ఎలా అతనిని పెళ్లి పీటల

"Dad, I wonder why Rama is called Sita Ram, while he never hesitated to humiliate that lady twice..." said Raghu.

"He is called Raghu Ram, Raghava Ram, Raja Ram, Sita Ram etc. with so many prefixes..."

"The rest I dont' mind. But this extolling as Sita Ram, I don't like. He had scant respect for womanhood. He thought of his greatness but never had an iota of consideration for the one whom he married and for whom he fought a battle and killed Ravana."

Smilingly Raghu's Father said: "Superficially it might appear so but in its trueness it is different. Rama had the foreknowledge that Sita would come out of the pyre as a glittering gold for the world to see, as Agni, the god of fire, would bow down in salutation to her. Even when an uneducated washerman found fault with the royal palace, it was for the king to set matters right. So, the Raja Ram in Ram banished her to the greenery of woods, allowing it appear as a fulfilment of her desire. Afterwards the Sita Ram in Rama wept for her in silent agony inexplicable in words."

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani*
*Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103*



మీద బంధించాలనుకునేదీ పిక్చర్ చూసిన మీదటగాని తెలియదు. పాటలలోని పదాలూ కదలికలూ నేటి స్పీడుకి తగినట్టుగా ఉన్నాయి. ఇది మీరు చదివే నాటికి పిక్చర్ విడుదలై వుంటుంది (పి ఆర్ ఒ : నరసింహం) .... ఈనాటి మూడవ ఫంక్షన్ పాత వుడ్‌లాండ్స్‌లో, మద్రాసు ఫిలిమ్‌ఫాన్స్ అసోసియేషన్ వారి బహుమతి ప్రదాన ప్రచురణ. ఇప్పటికి ముప్ఫయ్యేనిమిదేళ్లగా సినీ ప్రేక్షకాభిరుచిలో, ఉన్నత ప్రమాణాలు నెలకొల్పేందుకు నిస్వార్థంగా కృషి చేస్తున్న ఏకైక సంస్థ మద్రాసు ఫిలిమ్‌ఫాన్స్ అసోసియేషన్ (సెక్రటరీ : ఆరెస్ కన్నయ్య). ఎన్నో సంస్థలు అవార్డులు యిస్తూంటాయి. కాని, ఫిలిమ్‌ఫాన్స్ వారిది ప్రతిష్టాకరంగా భావిస్తుంది దక్షిణ భారతంలో సినీపరిశ్రమ. మొత్తం ఏడు విభాగాలు : తమిళ, తెలుగు, కన్నడ, మళయాళ, హిందీ భాషా చిత్రాల కమిటీలు అయిదు ; ఆ తర్వాత థియేటర్ పరిశీలన, స్టుడియో పరిశీలన కమిటీలు మరో రెండు. సాధారణంగా హైకోర్టు న్యాయమూర్తులు, ప్రముఖ విద్యావేత్తలు, ఆయా పానెల్స్‌కి (కమిటీలు) అధ్యక్షులై వుంటారు. ఈ సంవత్సరం తెలుగు పానెల్‌కి అధ్యక్షులు, జస్టిస్ రామానుజమ్. కమిటీ సభ్యులు ; కె అలగరిస్వామి, పి నరసింహులు చెట్టి, శాంతారామకృష్ణ, ప్రీతారెడ్డి, కెవి గోవిందరావు, యస్ సుబ్బయ్య చెట్టి, కళాభాష్యమ్, సుజాతారావు మిగతా ఆరు పానెల్స్‌కి జస్టిస్ రామలింగం, కె చంద్రచూడన్ ఐఎయస్, డా॥ ఇయస్ రాఘవేంద్రరావు, జస్టిస్ సత్తార్ సయ్యద్, జస్టిస్ సదాశివమ్, సియస్ వీర రాఘవన్ అధ్యక్షులు .... ఆగస్టు 27వ తేదీన యూనివర్సిటీ సెంటినరీ హాలులో బహుమతి ప్రదానం జరుగుతుంది. ఫిలిమ్ పరిశ్రమలో విశిష్టవంతమగు కృషి గావించిన వ్యక్తిగా ఈ సంవత్సరపు బహుమతి పొందుతున్నవారు అక్కినేని నాగేశ్వరరావు. తెలుగులో ఉత్తమ చిత్రం : స్వర్ణకమలం ; ప్రత్యేక ప్రశంస : ఓ భార్య కథ, రుద్రవీణ ; ఉత్తమదర్శకులు : విశ్వనాథ్ ; సంగీత దర్శకులు : ఇళయరాజా ; ఉత్తమనటుడు : చిరంజీవి ; ప్రత్యేక ప్రశంస : వెంకటేష్; ఉత్తమ నటి : జయసుధ ; ప్రత్యేక ప్రశంస : భానుప్రియ ; నేపథ్యగానం : యస్పి బాలు, సుశీల .... తమిళంలో ఉత్తమ చిత్రం అగ్నినక్షత్రం ; నటుడు : విజయకాంత్ ; నటి : రాధిక ; సంగీత దర్శకులు : చంద్రబోస్ ; నేపథ్యగానం ; యస్పి; చిత్ర ........ మళయాళంలో ఉత్తమ చిత్రం : వైశాలి ; నటుడు : మమ్ముట్టి ; నటి : రమ్యకృష్ణ .... కన్నడంలో ఉత్తమచిత్రం: సుప్రభాత; నటుడు : విష్ణువర్ధన్ ; నటి : సుహాసిని .... హిందీలో ఉత్తమ చిత్రం : ఘరానా ; నటుడు : రవిశంకర్ ; నటి : సుమలత ఆయా

కమిటీలలోని వారినిగౌరవించేనిమిత్తం ఈ అవార్డుల వివరాలు వెల్లడి చేసేం దుకూ జరిగిన ఈనాటి సభకు జస్టిస్ శివసుబ్రహ్మణ్యం అధ్యక్షత వహిం చారు. అయిదారేళ్లుగా సినిమా మధ్యలో జరుపుతున్న దానికంటె, చల్లబాటు వేళ వోల్డ్ వుడ్‌లాండ్స్ లో జరిపిన ఈనాటి సమావేశం ఎంతో నిండుగా హుందాగా వున్న దనిపించింది.

. . . . . 19

"సే చిత్రం 177 థియేటర్లలో రిలీజ్ చేశాము - ఒక్క హైదరాబాదులో 23 థియేటర్లలో! వరంగల్లులో ఆరు థియేటర్లలో. ఇలా చాలా పట్నాలలో ఆరేసి థియేటర్లలో రిలీజ్ చేశాం .... ఇంతవరకు రికార్డ్ సృష్టించిన చిత్రాలు వీరబ్రహ్మం, ప్రతిఘటన. ఆరెంటినీ కూడా అధిగ మించగలిగాము. 62 థియేటర్లలో యిప్పటికీ నడుస్తోంది. 31 కేంద్రాలలో శతదినోత్సవం జరుపుకుంటుంది. నేటి వేగానికి అనుగుణమైన లక్షణాలు - సన్నివేశ చయనికలో, కథావిష్కరణలో, గానలహరిలో - అన్నిటా వుండటంచేతనే ప్రేక్షకులు అంతగా ఆదరించారు." - అన్నారు. 'మహేశ్వరీ పరమేశ్వరి' సుబ్బరామ రెడ్డి, నవయుగా ఆఫీసులో జరిపిన సమావేశంలో, నిన్న ప్రారంభమైన 'విశ్వామిత్ర' గురించిన ప్రస్తావన రావడం సహజం. "యన్‌టిఆర్ గొప్ప కళాకారులు - ఆయనకు సాటి మరొకరులేరు. అయితే, సినిమా మెచ్చుకోవడానికీ, ఓట్లు పడటానికీ ఏమీ సంబంధం లేదు. ప్రజల వివేకాన్ని తక్కువగా అంచనా వేయ కూడదు .... ఎన్నికల సమయాన, అధికారంలోవున్న పార్టీచేసిన తప్పి దాలను ఏకరువు పెట్టడం ద్వారానే, ప్రత్యర్థులు ఓటర్ల సానుభూతిని సంపాదిస్తారు .... కాంగ్రెస్‌పార్టీ చేసిన పొరబాట్లు చెబుతూ, ఆంధ్రుల ఆత్మగౌరవం కాపాడుతాననే నినాదం మీదనేకదా 'తెలుగుదేశం' అధికారం లోకి వచ్చింది ? రేపురాష్ట్రఎన్నికలలో 'తెలుగుదేశం' ఈఆరేళ్లలోను ఏమేమి చేయలేక పోయిందో, నమోదు చేసు కున్న నిరుద్యోగుల సంఖ్య మూడిం తలు ఎలా పెరిగిందో, శాంతి భద్ర తల స్థాయి - యివేకదా చెబుతారు ? అవి చెప్పినంత మాత్రాన కాంగ్రెస్ నెగ్గదు. 'తెలుగుదేశం' పార్టీకి పటిష్ట వంతమగు బలంఉంది. అది రాష్ట్ర స్థాయిలో! కాని, కేంద్రంలో, కాంగ్రెస్‌కి ప్రత్యామ్నాయం మరొకటి లేదు - 42 ఏళ్లలోను, మధ్యనొక మూడేళ్లు మినహాయించి, వారు అధికారంలో ఉన్నారు. రెండు జాతీయపార్టీలు వుండటం మంచిదే! ప్రజాస్వామ్యంపై విశ్వాసంగల ప్రతి ఒక్కరూ అదే అభిలషిస్తారు. అయితే ఆ రెండవపార్టీ ఆవిర్భావం కను చూపుమేరలో లెదు. అంచేత, ప్రస్తుతం మనకున్నది కాంగ్రెస్ ఒక్కటే! కళారంగంలోను, సాంస్కృ తిక రంగంలోను గత పదిహేనేళ్లుగా యితోధిక సేవచేస్తున్న నాకు, రాజ

కీయాలద్వారా కూడా నాకు చేతనైనది చేయాలనే కోరికతో 1989 ఏప్రిల్ 27వ తేదీన కాంగ్రెస్‌పార్టీలో చేరాను. నేను చేరడమేకాదు - నాతో వున్న 205 అభిమాన సంఘాల సభ్యులని కూడా అందులో చేర్పించి, వారిచేత ప్రమాణ స్వీకారం చేయించాను. అన్నీ సవ్యంగా జరిగి, నేను ఏ నియోజక వర్గం నుంచైనా కాంగ్రెస్ అభ్యర్థిగా ఎన్నుకోబడటం జరిగితే, అయిదేళ్ల పాటు పార్లమెంటేరియన్‌గా పని నేర్చుకోవాలనేతప్ప, నాకు ఎటువంటి పదవీకాంక్షలేదు" - అన్నారు సుబ్బరామరెడ్డి. అయిదారు నెలలకీ యిప్పటికీ ఆయన మాట పొందికలో, విషయవివరణలో, రాజకీయ విశ్లేషణలో ఎంతోవిజ్ఞత కనిపిస్తోంది - 'స్టేట్‌రౌడీ' సక్సెస్, కాంగ్రెస్ ప్రభావమూ అందుకు కారణాలు కావచ్చు. కళాబంధుత్వం నుంచి రాజకీయసేవకు మళ్లుతున్న సుబ్బరామరెడ్డికి జయమగుగాక అని మనస్ఫూర్తిగా కోరుతున్నాం.

—యన్నార్ చందూర్



హృదయాలు లేకుండా ఇల్లు అనేది లేదు. —బైరన్

మంచి పనులు జ్ఞాపకం పెట్టుకునే మార్గమేమిటంటే, వాటిని అప్పుడప్పుడు గుర్తు చేసుకోవటం. —కాటో

ఒక మనిషి గుణ గణాలని బొమ్మల పుస్తకంలా చెప్పేవి అతను చేసే కార్యాలు. —ఎమర్సన్



# ముఖచిత్రం



పదహారూ పద్దెనిమిదేళ్ల క్రితం ఉత్తరప్రదేశ్‌కి చెందిన సుందరలాల్ బహుగుణ, ఉత్తరఖండ పర్వతాలలోని చెట్లు నరికేయవద్దని ఒక ఉద్యమం లేవదీశారు. గొడ్డళ్లు పుచ్చుకు చెట్లుకొట్టే వాళ్లు రాగానే, గ్రామీణ స్త్రీలను ఆ చెట్లకు హత్తుకు పొమ్మన్నారు - చిప్కొ అనగా హత్తుకుపోవడం, లేక అంటుకుపోవడం! అంతా చట్ట సమ్మతంగా చేస్తున్నామనుకొనే ప్రభుత్వాధికారుల కళ్లు తెరిపించే మార్గం అదొక్కటే అయింది. పచ్చని చెట్టు కొట్టడం నేరమే! కాని పరిశ్రమల కోసం అడవులను నేలమట్టం గావిస్తున్న నేటిమానవుడు, ప్రకృతిలోని సహజ తులామానాన్ని తను ఏవిధంగా భంగపరుస్తున్నదీ తెలుసుకోలేని మూర్ఖుడవుతున్నాడు. సుందరలాల్ బహుగుణ చిప్కొ ఉద్యమం దేశదేశాలకీ పాకింది. అడవులు కాపాడటం ఎటువంటి తక్షణావశ్యకతో అన్నిదేశాలూ గుర్తించాయి .... మార్నింగ్‌వాక్‌లో తన కంటబడ్డ చెట్టు, గొడ్డలివాత పడకుండా ప్రేమ్‌చంద్ ఎలా విలవిల్లాడారో మిత్రులకి తెలుసు. అటువంటి వారు అనేకులు వున్నారు. వారినుద్దేశించే కన్నీరు కారుస్తోంది వృక్షరాజం ("సేవ్ అవర్ వుడ్స్" అనే ప్రదర్శనలో హాన్స్‌ఎర్ని చిత్రం - 'జర్మన్ ట్రిబ్యూన్' సౌజన్యంతో

సీరియల్

# మజిలి

## అన్నపూర్ణా రెడ్డి

గడిచిన కథ: కళా హృదయిని జ్యోత్స్న, తన యిద్దరు పిల్లన్ని భర్త వద్ద వొదిలి వెళ్లిపోయింది: బాధ్యతగల తండ్రిగా ఆ పిల్లల్ని పెంచుతున్నాడో డాక్టరు సారధి. ఆశ్రయం పొందిన జానకి హౌస్ కీపరుగా పిల్లల ఆలనా పాలనా చూస్తోంది. తప్పని సరై ఒక పేషంటుని ఇంటికి పట్టుకొచ్చాడు సారధి.... ఇక చదవండి.

భగవాన్ ఈ మాత్రం ఆధారాన్నయినా ఇచ్చావు: ఈ నీడలేకపోతే నా గతేమిటి? - మనసులోనే అనుకుంది.

"ఏమండీ....ఏమండీ"-హాల్లోంచి, విమల గొంతు విని "ఏమండీ?" అంటూ హాల్లోకి వచ్చింది జానకి.

"నేనిప్పుడే పి. హెచ్. సి. కి వెళ్ళి వస్తానండి. డాక్టర్లు ఆపరేషను మొదలెట్టుతారు. వాళ్ళ వివరాలు వ్రాసిన పట్టిక ఇందాక కాంపౌండరుకివ్వడం మర్చిపోయాను!"

విమల వుంది కదా అన్న ఆ ధైర్యంతో ఎలాగో అటూఇటూ గంభీరంగా మసలిన జానకి బిక్క చచ్చిపోయింది.... "అంత అవసరమంటారా?" అంది బేలగా.

"అయ్యో! లిస్టు లేకపోతే ఇంకేమైనా వుందా? డాక్టరుగారికి కోపం వచ్చేస్తుంది. డ్యూటీకి సంబంధించిన విషయాల్లో డాక్టర్ సారధి చాలా స్ట్రిక్ట్ వెంటనే వచ్చేస్తానండి!" పరుగులాటి నడకతో బైటకు నడిచింది.

"కాదండీ .... విమల .... ఇంత రాత్రిపూట ఒంటరిగా వెళ్ళగలరా?"

వెనక్కు తిరిగి.... "ఉన్న ఊళ్లో భయమెందుకండీ బాబు!.... అయినా ఈ తుమ్మ మొద్దును, మెల్ల కన్ను బ్యూటీని ఆశించేదెవరు.... మన సంస్కారం అంత హైన్యానికి ఇంకా దిగజార లేదులెండి. ఉన్నట్టు వచ్చేస్తా .... సారీ" .... చిన్నగా నవ్వుకుంటూ చీకట్లో కలిసి పోయింది విమల.

పొట్టిగా నల్లగా బొద్దుగా ఆకర్షణీయంగా అవుపిస్తున్న విమల తన అందాన్ని అంత ఎద్దేవాచేసి మాటలాడేసరికి, జానకికి కూడా నవ్వు వచ్చింది.

'అమ్మాయి' అనుకుంటూ కాస్సేపు అక్కడే నుంచొని వెను తిరిగింది.

పేషెంటు గుర్తొచ్చేసరికి గుండె గతుక్కుమంది. పోనీ ఓ సారి ప్రక్కింటి సీతారామమ్మను పిలుచు కొంటె?... అనుకొని వాళ్ళింటి వైపు తొంగి చూచింది. చిక్కటి చీకటి మినహా వెలుతురు లేదు. అలికిడీ లేదు. పొలంలో కష్టించే సీతా రామమ్మ అలసి పడుకొని వుంటుం దని గుర్తొచ్చి అదిరే గుండెను చిక్క బట్టుకొని లోపలికి వచ్చింది.

స్టౌ వెలిగించి కాఫీ కాచి ఫ్లాస్కు లో పోసి బల్ల మీదుంచింది.

విమల వెళ్ళిన గడియ గడియకూ వీధిలోకి తొంగి చూడ్డం మానలేదు జానకి.

"అమ్మా" అన్న మూలుగుడు వినే సరికి వెన్ను ఎవరో చరిచినట్టయి లోనికి తొంగి చూచింది. అతడు కొద్దిగా కదిలాడు. కాళ్లు, చేతులు గజ గజలాడుతోంటే కాస్త దగ్గరగా వెళ్ళి చూచింది జానకి కళ్లు తెరు

—

విమల వెళ్లిన అరగంటకు హెల్త్ వర్కర్ వచ్చాడు.

"విమలగారు అక్కడే వుండి పోయారు. పేషెంట్ కండిషన్ ఎలావుందో చూచి రమ్మన్నారు డాక్టరు గారని" గదిలోకి వచ్చి నాడీ కళ్లూ చూచాడు.

జానకికూడా దగ్గరగా నుంచుంది. దుబ్బు రేగిన జుట్టు, మాసిన గడ్డం, కమిలినట్టున్న శరీరచ్ఛాయ.

"ఎలా వుంది?"

"బాగానే వున్నాడండీ .... వస్తా నండీ" .... అక్కడ పనులు .... వెళ్లాలి అంటూ సైకిలెక్కి వేగంగా దూసుకుపోయాడు హెల్త్ వర్కర్.

లైటువెలుతుర్లో ఆ ముఖాన్ని కాస్త దగ్గరగా పరికించి చూచింది.

"అవును ... ఆ రూపురేఖలు .... ! .... సర్ప దంష్ట్రలా దూరంగా జరిగింది జానకి.

"అమ్మా ....అమ్మా ...." - మూల్గు తున్నాడావ్యక్తి .... వెనుతిరిగింది .... కళ్లు మెల్లగా విచ్చుకొంటున్నాయి. మగతగా మూతలు పడుతున్నాయి.

నాలుక తడుపు కొంటూంటే, గ్లూకోజు కలిపిన నీళ్లు చంబాతో నోట్లో పోసింది. గుటక వేయడం చూచి గోరువెచ్చటి కాఫీ గొంతులో పోసి, ఇవతలికి వచ్చేసింది జానకి.

హాల్లో జానకి ముఖం గంభీరంగా వుంది. మనసులో భయంస్థానే స్తబ్దత నిండుకుంది.

అవును .... అతడే .... అతణెలా మర్చిపోగలదు .... రెండు .... నిండు సంవత్సరాలనాటి సన్నిహితం .... ఆ చూపులు .... చూపులకే పరవశత్వం చెందేది. ఓనాడు .... అమాటల్లోని గారడికే లొంగిపోయింది తను. భగ వాన్ .... గుండెలమీద రెండు చేతులూ అదుముకుంది. లేచి నెమ్మ దిగా అడుగులేస్తూ వసారాలోకి వచ్చి చీకటిలో కూర్చుంది .... తన బ్రతుకు లాగే .... ఆ చిక్కటి చీకటి .... అందుకే .... మనసుకు ఒకింత హాయి చిక్కిందా చీకటిలో ....

చేసిన పాపం వూరికే పోతుందా ? భగవంతుడు లేడూ ? .... పాపానికి ప్రతిఫలం ఎప్పుడో వచ్చాక జరుగుతుందంటారు .... కాని .... ఎప్పటి కప్పుడు ఆ భగవంతుడే చూపిస్తుంటాడు. .... కాని మానవుడే తెలుసుకోలేక పోతున్నాడు .... అందుకే మనుషుల్లో పాపబుద్ధి, ద్రోహచింత విపరీతంగా పెరిగిపోతున్నాయి .... .

'బాగా చేశారు .... మక్కెలిరగ తన్ని మూల పడేశారు .... అలాగే కావాలి ....'

మనసులో ఏ మూలో దాగున్న అక్కసు పైకి తన్నుకొచ్చింది. కాసేపు పైశాచికానందం అనుభవించింది జానకి. ఆ మంచంలో మనిషి మూల్గు విని సంతోషించింది .....

దాదాపు మధ్యరాత్రి వరకు సారథి పి.హెచ్.సి. లోనే వుండిపోయాడు. తమ సిబ్బంది ప్రచారం ముమ్మరంగా చేసి ఎక్కువ కేసులు పట్టుకొచ్చారు.

కానీ ....

వాటిలో నిజంగా కుటుంబ నియంత్రణ అవసరం వున్న కేసులు ఎన్నో తేల్చుకోవడం ముఖ్యమైంది. పెళ్లి కానివారూ, వయసు పైబడ్డవాళ్లూ పెళ్ళయి పిల్లలు లేనివాళ్లూ ..........

(ఇంకా వుంది



## చిత్రజగతి

## సమీక్షలు

### విజయకృష్ణా వారి 'సాహసమే నా ఊపిరి'

దేశభద్రతకు సంబంధించిన రక్షణ స్థావరాల రహస్యాలను ఒక విద్రోహముఠా బయట దేశాలకు అమ్మనున్నదనే విషయం తెలుసుకు, కేంద్రం నుంచి రాష్ట్రానికి ప్రతాప్ (కృష్ణ) అనే ప్రత్యేక ఇంటిలిజెన్స్ అధికారిని పంపుతారు. అయితే ఈ అధికారి రహస్యశాఖ పనిచేసే తీరులో గాక, వీధిపోరాటల్లో సైతం కల్పించుకు, తను ఒక్కడూ ప్రజలను చట్టబద్ధులుగా చేయాలని తాపత్రయ పడతాడు. స్ట్రీట్‌రౌడీ విజయ్ (నరేష్) చేసిన నేరానికి కోర్టులో శిక్ష పడకుండానే అతనిని సబిన్‌స్పెక్టరు చేయించ గలుగుతాడు. యస్పీగారి (గుమ్మడి) అమ్మాయి రేఖ (అమల) ఈ విజయ్‌లోని పరోపకార బుద్ధి మెచ్చుకొని అతనిని ప్రేమిస్తుంది. లేడీ డాక్టరైన తన భార్యను (విజయనిర్మల) కూడా ప్రతాప్, తన పోస్టింగ్‌తో బాటు ట్రాన్స్‌ఫర్ చేయించుకోగలుగుతాడు. యమ్మెల్యే పరాత్పరరావు (కోట శ్రీనివాసరావు), హోమ్‌మంత్రి శంభుప్రసాద్ (త్యాగరాజు), ముఖ్యమంత్రి (శ్రీధర్) విద్రోహుల ముఠాతో సంబంధం కలిగివుంటారు. మోహనరావు అనే గాంధేయవాది నిరాహార దీక్షలో గూండాళ్లతో నరకబడతాడు. తన డాక్టరు ఉద్యోగానికి రాజీనామా యిస్తుంది ప్రతాప్ భార్య. సాహసమే ఊపిరిగా గల హీరో దుష్టశక్తులను దునుమాడి, దేశవిద్రోహులకు శిక్షలు వేయిస్తాడు. ఈ పొలిటికల్ కారికేచర్‌ని ప్రేక్షకులు ఏవిధంగా తీసుకుంటారో చెప్పలేము. దర్శకత్వం: విజయ నిర్మల, .... పిఆర్‌ఓ: రాజు.

### కృష్ణచిత్ర వారి 'మమతల కోవెల'

తలిదండ్రులు లేక, చెవిటి అన్నగారు మాత్రమే గల ఒక బీదమ్మాయి జ్యోతి (సుహాసిని) కోటీశ్వరుడు భానోజీరావు (జగ్గయ్య) వద్ద టైపిస్టుగా చేరుతుంది. పెద్దబ్బాయి (రాజశేఖర్), ఆయనా కృతక ఆశయాలతో బద్ధ శత్రువుల్లా కనిపిస్తారు. (తల్లి మరణశయ్యమీద వున్నప్పుడు కబురు తెలిసి కూడా తండ్రి వెంటనే రాలేదని,

ఏడెనిమిదేళ్ళ వయసప్పుడు అతనిలో ఏర్పడ్డ 'కక్ష' పరిణామ ఫలిత మంతా - అయితే ఈ పెద్దబ్బాయి అవేశ ఫలితమగు హత్యానేరం మీద కటకటాల వెనక పడ్డప్పుడు 'తండ్రీ కొడుకులు పరస్పరం అర్థం చేసుకుని ఒకటవుతారు). కోటీశ్వరుని చిన్న బ్బాయి (శుభలేఖ సుధాకర్) బుధజన విధేయుడు. ఆ బుద్ధిమంతుని వెంట పడుతుంది - కోటీశ్వరుని మిత్రుడు సర్వరోగ పీడితుడూ అయిన ఒక డాక్టరుగారమ్మాయి సుందరి .... పేద లను ఆదుకోవడమే జీవిత లక్ష్యంగా గల పెద్దబ్బాయి, తమ డ్రయివరు కుటుంబాన్ని ఆదుకొనే నిమిత్తం, ఇనప్పెట్టె తాళాలకోసం ఆవేశంలో జ్యోతిని లెంపకాయకొట్టి, బస్సు పరిచయాన్ని ప్రేమ ప్రకరణగా మారుస్తాడు. ఈమెగారు తన రెండో చెంప స్వయంగా బద్దలుకొట్టుకు, ప్రేమ పూజారిణిఅయి, ఆత్మాభిమానం గల అతన్ని పెళ్ళిచేసుకు, ఇద్దరు పిల్లల తల్లిఅయి, బైపాస్ సర్జరీకి అమెరికా వెళ్ళివచ్చాక, ఆ కోటీశ్వరుని యిల్లు 'మమతల కోవెల'గా మారు స్తుంది. అక్కడక్కడ ఛెళుకులే తప్ప కథలో పటుత్వం లేదు - పాటలు బావున్నాయి. దర్శకత్వం : ముత్యాల సుబ్బయ్య. సమర్పణ : హరికృష్ణ.

## స్నేహ చిత్రా వారి 'భూపోరాటం'

భూపతి ఒక పెద్ద భూస్వామి. భూ పరిమితి చట్టం అమలులోకి రాగానే, ముప్పయ్యేళ్లు కాపరం చేసిన భార్యకు, తన భూవసతి కాపాడుకొనేందుకు వుత్తుత్తివిడాకులు యిస్తాడు. భూపతి కొడుకు, ఆధునికతకు చిహ్నంగా గడ్డం పెంచడం తప్ప మిగతా అన్నిటిలో తండ్రిని పోలిన తనయుడు. ఈ సుపుత్రుడు రైతుకూలీసంఘనాయకుని (నారాయణమూర్తి) తమ ఫాక్టరీలో దారుణంగా పొడిచి చంపడం, ఎనిమిదేళ్ల కుర్రవాడు (ఆ నాయకుని మేనల్లుడు) కళ్లారాచూస్తాడు. అయితే విధేయత కృతజ్ఞతలపేరిట, బానిసత్వం నరనరాల్లో జీర్ణించుకుపోయిన, యింటి నౌకరు, ఆ నేరం తనమీద వేసుకు జైలుకి వెళ్తాడు. ఇల్లు వూడ్చే హరిజన యువతిపై అత్యాచారం జరిపిన భూపతి, ఆ గూడెంప్రజలు కట్టగట్టుకు వచ్చి, తన యింటిమీద పడగా, (మరొక కారణంగా ఆమె నూతిలో దూకి మరణిస్తుంది) అమాయకత్వం నటించి, ప్రమాదం నుంచి బయట పడతాడు. అయితే, ఆసన్నివేశం అటు హరిజనులకిగాని, యిటు ప్రేక్షకు లకుగాని 'కన్విన్సింగ్'గా కనిపించదు. ఇది మచ్చుకి మాత్రమే - యిలాటివి చాలా వున్నాయి. వరి పండించే రైతులు, చెరకురైతులు, పత్తిరైతులు అందరూ ఒకరే అవడంతో వాస్తవికత లోపించింది; అంతంతగా వున్నకథా బలం మరింత సన్నగిలింది. పేదల ఆక్రందన, ఎర్రజండాల వూరేగింపు, నినాదాలు పలికే పాత్రలుగల ఈ చిత్రంలోవంగపండు పాటలు హైలైట్. దర్శకత్వం : నారాయణమూర్తి. ❋